శ్రియై నమః

# హంతక చూడామణి

## (డిటెక్టివ్ నవల)




రచయిత:

సహస్రావధాన ఫణీంద్ర, సహస్రావధాన వాచస్పతి,
సహస్రావధాన చతురానన, సహస్రావధాన
పంచాననా ద్యనేకబిరుదాంకిత
పంచ సహస్రావధాని

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి





ప్రకాశకులు:

కొండా శంకరయ్య
పుస్తకవ్యాపారులు,
సికింద్రాబాద్, హైద్రాబాద్ & వరంగల్.

1953



[వెల రు. అ. 1—0—0

# విజ్ఞప్తి

తెలుగుభాషలో నవలలెన్నియోగలవు. అందుగొన్ని చదువుట కారంభించినతోడనే విసుగుపుట్టించునవి కూడ లేక పోలేదు. ఈ హాంతకచూడామణి అట్లుగాక చదివినకొలది యింకా చదువవలయునని యభిలాష జనించుచుండును. ఎందుకన నీ నవలయందలి పదలావణ్యము భావములు రస పూరితములు. ఇందు సహస్రమారి, శతమారి, దశమారి, యను మారిణీత్రయము తమ స్త్రీ సాహసంబును ప్రత్యక్షముగా ప్రపంచమునకు జూపి అపరాధ పరిశోధకుల నల్లాడించిన విషయము చదువదగినది. ఇట్టి గ్రంథమును రచించిన బ్రః శ్రీః స్రహసావధాన చతురానన సహస్రావధాన పంచానన, సహస్రావధాన వాచస్పతి యిత్యాది బిరుదాంకితులగు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగా రెంతయు ప్రశంసనీయులు. వీరు రచించిన నవలలెన్నియోగలవు. వాటినన్నిటిని అచిర కాలములోనే అచ్చువేయించి పాఠకుల కందజేయగలము.

ఇట్లు
ప్రకాశకులు.

---

# హెచ్చరిక

ఈ పుస్తకముయొక్క సర్వాధికారములు మాకే జెందియున్నవి. కావున మా అనుమతి లేనిది దీని నితరులు ముద్రింపగూడదు. అట్లు ముద్రించినచో మాచే నొనర్పబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా హెచ్చరించనైనది.

ఇట్లు

కొండా శంకరయ్య

పుస్తకములవ్యాపారము

సికింద్రాబాద్.

# హంతక చూడామణి

## మొదటి ప్రకరణము

ఒకనాటి సాయంసమయమున విలాసవతీ నగరమునకు బశ్చిమభాగముననున్న కొండగట్టుపైనుండి సూర్య భగవానుడు రాజవీధుల, సందుల, గొందుల, దొంగిచూచి, యచ్చటి ధనకామినుల దుష్ప్రవర్తనముల కాగ్రహించెనో యనునట్టులు మేనెల్ల నెఱుపుసేసికొని, యిట్టి యవినీతి వర్తనల మొగములు చూడజాల ననినట్లు క్రమముగ పడమటి సంద్రమున గ్రుంగ నుంకించుచుండెను. విలాసవతీనగరము క్రీస్తు జననమునకు బూర్వము నూటయెనిమిదియేడు సంవత్సరములకు బూర్వము, సర్వస్వాతంత్ర్యలక్ష్మితో విజృంభించుచున్న ఆంధ్ర సామ్రాజ్యమునకు రాజధానీనగరమైన ధాన్యకటకమునకు ఒకపూట ప్రయాణము చేయదగిన యంతటి దూరముననుండెను.

ఆంధ్రసామ్రాజ్యాధీశులు కేవలము ధర్మతత్పరులగుటచే, ధాన్యకటకమున నివసించుచుండిన వ్యభిచారిణీ కులము నచ్చటనుండి వెడల నాజ్ఞచేసి, సుఖప్రదమగు మఱియొక తావున నగరనిర్మాణముచేసికొనుట కనుమతి యొసంగిరి. అట్టి శృంగార యువతులు నిర్మించుకొనిన నగరమే విలాసవతీ నగరము. అప్పటి ధాన్యకటకాధీశ్వరుడగు నాంధ్రరాజు, శాతకర్ణి, ధర్మతత్పరత ఇట్టినూతన నగర నిర్మాణమునకుసహగారణమయ్యెను.

కటికచీకటి విలాసవతీనగరము నావరించెను. జార చోరులకు నిలయమైన విలాసవతిపై రారాజు ప్రత్యేకదృష్టి నుంచి పరిపాలించుచుండెను. అపరాధ పరిశోధక శాఖకు సంబంధించిన యుద్యోగీయుల కార్యస్థానముగా నడివీధిలో నొకప్రక్క నొక పెద్దభవనము నిర్మింపబడి యుండెను. తెల్లనైన గోడలుగల యితర గృహములకంటె భిన్నముగ నగపడుటకును, న్యాయార్థులు సులభముగ గుర్తించుటకును, పరిశోధనకార్యాలయమునకు పచ్చని రంగువేయబడియుండెను. ప్రాంగణమున, పూవులచెట్లచే నిరువంకల నలంకరింపబడిన బాటయేర్పఱచబడి యుండెను.

ఆనాటి సంజవేళ మీఱిన రెండుగడియలకు, పరిశోధన శాఖాధ్యక్షుడు ముంగిటితోట మైదానమున బల్లపై కాగితముల నుంచుకొని తానొక చతుష్పాద పీఠమున గూరుచుండి, మ్రోలనిలువబడియున్న రక్షక భటులను ప్రశ్నలువేయుచు ప్రత్యుత్తరముల నాలకించుచు కార్యాలోచన సేయుచుండెను. రేయి నైదు గడియలు గడచినవి. అట్టియెడ గీచుమని యొక బాలిక రోదన ధ్వని పరిశోధనశాఖాధికారి చెవింబడెను. ఆయార్తనాదము వెలిపఱచుచున్న భవనమునకు బోయి, వెలుపలియరుగునొద్ద గుప్తముగా నిలుచుండి రక్షక భటుడీ సంభాషణమును వినుచుండెను.

“అధమురాలా? నీకు పదునెనిమిది యేండ్లు నిండినవి. పదియేండ్లనుండి నీకు నాట్యాదికళలు నేర్పించితిని. నీకు సంగీతము జెప్పించుటకు నాలుగు శ్రుతిపెట్టెలు పగిలిపోయినవి.

బోధకులకొఱకు వేలరూపాయలు వెచ్చబెట్టినాను. నీవల్ల ఈసంసారమునకు ఒక గుడ్డిగవ్వ ఆదాయము లేదు. పొరుగింటి అమ్మలక్కలనుజూచి నేర్చుకొను తెలివియైన నీకు పరమాత్మ్మడియ్యలేదు. గ్రుడ్లుమిటకరించిచూతువు. మాటాడవేమి?"

"నన్నేమిచేయుమందువు?"

"ఏమందునా ? ఈయూరిలో విటుల నాకర్షించి సొమ్ము సంపాదించుమందును. చేతగానియెడల మఱొకతావు చేరి బ్రతుకు తెరువు చూచుకొనుమందును."

"అమ్మా! మంచిది. నన్నుదండింపకుము. నా సఖియగు దశమారిని దీసికొని నేనెందేనిబోయి, యొకతావుచేసికొని, యార్జనము నారంభింతును."

"సరి. ఆలోచించుము. రంగసాని బిడ్డ శతమారిగాదా యని పేరుదెచ్చుకొనులాగు ప్రవర్తించి, వన్నెకెక్కుము."

ఈ సంభాషణము నాలకించిన రక్షకభటుడు, ఇదేమియో తల్లిబిడ్డల ప్రసంగమని గ్రహించి జరిగిన విషయము తనయధికారికి జెప్పెను. పరిశోధనాధికారి తనకార్యాలోచనము ముగించి నివాసస్థానమునకు బోయెను. నిశావిధి నిర్వహించుటకు కొందఱు రక్షకభటు లందేయుండిరి.

# హంతక చూడామణి
## రెండవ ప్రకరణము.

గోదావరీతీరమున పాపికొండల ప్రాంతమునగల లోయ లలో మనుష్యసంచారము చాల తక్కువగనుండును. ఒక లోయలో నమరింపబడిన పెద్దరాతిక్రిందుగ నొకసొరంగమును గలదు. ఆపెద్దరాతియొద్ద ముప్వురు యువతీమణులిట్లు మాటాడ జొచ్చిరి.

"అమ్మా! ఇకముందు మనము బోవలసినమార్గము గూఢమైనది. కఠినమైనదియునై యున్నది. మీరింక సాహస మూని కష్టమునకోర్చి నిశ్శబ్దముగ రావలయును". "ఇట్లు మమ్మెచ్చటికి దీసికొనిబోయెదవు?" "కొండగర్భమున నున్న, మా సంఘాధికారిణి సభాభవనమునకు దీసికొని పోయెదను. వారి అనుమతి దీసికొని మిమ్ము మాసంఘమున జేర్చుకొని యెదను. అంతటితో మీకష్టములు నెఱవేఱునట్లు భావింప వచ్చును."

"మంచిది. అట్లే పోయెదముగాక." ఈప్రసంగము ముగిసినంతనే, స్థానపరిచయముగల యువతి తన కుడికాలి మడిమెతో నాపెద్దరాతిపై రెండుమారులు దన్నెను. ఆరాయి త్రోవయొసంగెను. ముప్వురును గుహాంతరాళమున బ్రవేశిం చిన తోడనే యారాయి తిరిగి త్రోవనుమూసివైచెను. విద్యు ద్దీపికచే త్రోవ చూపించుచు మఱియొక యువతీమణి వారి

మోల నడచుచుండెను. వారు నలువురును సారంగము మార్గమున బోయి యొక మనోరంజకమగు భవనములోనికి జేరిరి.

ఆభవనమునకు ముందటి యంగణమునగల కార్యాలయమున గంభీరాకృతిగల యొక యంగనామణి యలంకృతాసనమున గూర్చుండియుండెను. ఆమెకు నలువది సంవత్సరముల ప్రాయముండెను. విశాలములగు కన్నులును, నెన్నుదురును, తఱుచు చిఱుకురులుగల కనుబొమలును నామె గాంభీర్యమునకు దోహదము చేయుచుండెను. ఆమెయొక పెద్దయంచుగల గులాబివన్నియ కోకను గట్టి, తొగరు మెరుపుగల పాదరక్షలను దన పాదముల దొడుగుకొని యుండెను. తన మోలనున్న మేజుపై నొక చిన్నపాత్రమును, మసిబుడ్డియు, నీఁకెకలమును నుండెను. మేజుకెదురుగ నితరులు గూర్చుండు పొడవు బల్లలమర్పబడియుండెను. ఈమెయే గుహా మహిళా సంఘాధ్యక్షురాలు. ఈమెనడుమున నొకప్రక్క చిన్నిబాకును, రెండవ ప్రక్క నొక పిస్తోలు అను మరశతఘ్నియు వ్రేలాడుచుండెను.

పదధ్వనుల నాలకించి గళముత్రిప్పి చూడగానే ఆమెకిరువురు అభినవయువతు లగపడిరి. వారినాహ్వానించి, మోల బల్లపై కూర్చుండ నానతియొసఁగెను. ఆయువతీయుగ్మ మాసనముల నలంకరించినవెనుక ఈక్రింది సంభాషణము ప్రారంభమయ్యెను.

"జవరాలా ! మీరెచ్చటనుండి వచ్చుచుంటిరి."

"విలాసవతీ నగరమునుండి"

"మీ పే ర్లే మందురు."

"నన్ను శతమారి యందురు." ఈ రమణి నాసఖి. ఈమెను దశమారి యందురు."

"మీరాక కేమికారణము"

"తల్లీ! నాతల్లి యొక వేశ్యమాత. కిరాత పుత్త్రికనగు నన్ను నాచిన్నతనముననే నాతలిదండ్రుల కింతధనమొసంగి యావేశ్యమాత విక్రియముపొందినది. నాటనుండియు నాకన్న వస్త్రముల నిచ్చి పోషించుచు పెద్దచేసినది. ఈ నాసఖియు పిన్న నాటనుండి నాతోడ నాటపాటలయందు నెయ్యముతో ప్రవర్తించుచు, నాకు మనస్సు సంతోషము గొలుపుచుండెడిది. ఇటీవల నేను ప్రాయము పొందితిననియు, ఆర్జనలేక వ్యర్థముగా నామె సొమ్ముదినుచు గాలము పుచ్చుచుంటిననియు దలంచి, ఏమైన సంపాదించుము లేనిచో ఇలువెడలిపొమ్మని నన్నుదండించినది. వెంటనే నేను నా దశమారిని వెంటబెట్టుకొని, ఇల్లు వెడలితిని. గౌతమిలో పొగయోడపై ప్రయాణము చేయుచు, ఈసమీపతీరమున నదీప్రవాహము ప్రమాదకరమగుటచే యోడయజమాని మమ్ముల సురక్షితముగా నొడ్డునవిడిచెను. చింతాక్రాంత చిత్తులమై యల్లనఁ దప్పటడుగులు వైచుచు కొంత నడయాడినవెనుక, ఈమీ భృత్యురాలు మా వృత్తాంతము కనుగొని, మీ కార్జనోపాయము మా గుహామహిళాసంఘాధికారిణి జూపగలదని మమ్మిందులకు దోడ్కొనివచ్చినది."

ఈమె కేవిద్యయందైన ప్రవేశము గలదా ?"

"ఈమె ప్రయత్న పూర్వకముగ నేమియు జదివి యుండలేదు. కాని ఈమె యొక్క పల్లెవానిబిడ్డయగుటచే, యోడనడపు విధానమున సహజశక్తి గలిగి యున్నది."

"మా సమాజముయొక్క నియమములను, మీకు దెల్పె దను. ఆనియమములకు మీ అంగీకరించితిరేని, మీ మనోర థము తీరునంతవఱకు ధనాదుల నార్జించు మార్గముల జూపు దును, మాసమాజమునకు మీరు సభ్యులు కావలయును."

"మీరేనియమములను దెల్పినను మీసమాజమున జేరుటకు సిద్ధముగా నున్నారము. ఏమార్గమున బోయినను గమ్యస్థానముచేరుట ముఖ్యము. ఏయుపాయముల బూనినను ధనవంతులమై జీవితము సార్థకముచేసి కొనుటయే కర్తవ్యము. ధనముగలవానిని బంధుమిత్రులోక రాజుగా గౌరవింతురు. స్వామివలెఁ బూజింతురు, గురువునువలె సభ్యులభినందింతురు. ధనముగలవారే కులీనులుగా భావింపబడుదురు. ధనమువలన దానధర్మ సిద్ధికాగలదు. దానము, భూతదయ మున్నగునవి ధనమువలన సాధ్యమగుటచే, సంచితములైన యన్నికలుషము లును హరించునటుల మానవులు ప్రవర్తింపవచ్చును. సర్వ వ్యవహార రహస్యమైన ధనము సాధ్యమగునప్పుడు మీరే కృత్యము జేయుమన్నను జేయుటకు సిద్ధముగానున్నవారము."

"మంచిది. సంతోషము." అనిపల్కి యాగుహామహి ళాసంఘాధికారిణి తన ముందున్న కలమునుదీసికొని, మసి

బుడ్డిలో నుంచి, తమ పాత్రములో వారి పేరులను వ్రాసికొనెను. ఈసంఘనియమముల కన్నింటిని మేమంగీకరించుచున్నారమను శీర్షిక క్రింద వారి చేవ్రాళ్ళను దీసికొనియెను. మఱియు వారితో నిట్లనెను. "సఖులారా! ఇఁకముందు మీ రెట్టి మనోవృత్తి నవలంబింపవలయునో, యెట్టి ధైర్యసాహసములతో బ్రవర్తింపవలయునో, యెట్టి కష్టముల నెదుర్కొనుటకు నెట్టియోరిమి కలిగియుండవలయునో, ఆరీతి యెల్ల మీకు నేర్పెదము. తొలుదొల్త ఈశ్యామలతోడ బోయి, యీ భవనము వెనుక నున్న యరలన్నియు జూచి ఈసమాజము యొక్క కృత్యములరీతియు, నిందలి దృశ్యములచే గ్రహించుడు. శీఘ్రముగ నవియెల్ల జూచి. తిరిగి నాయొద్దకు రండు."

శ్యామలతో శతమారియు దశమారియు కార్యాలయము వెనుకకు బోయిరి. సంఘాధికారిణియగు సహస్రమారియు దన విశ్రాంతి గృహమునకు బోయెను.

---

# హంతక చూడామణి

## మూడవ ప్రకరణము.

విలాసవతీనగరమున బరిశోధన కార్యాలయమునొద్ద నిరువురు పేరులుచేరి యేమో విన్నవించుకొను వారివలె నిలిచియుండిరి. వారి తెల్లని యంగీలును వేళ్ళనున్న బంగారపు టుంగరములును, ముంజేతిగడియారములును వారొక ధనిక కుటుంబమునకు జెందినవారని ఘోషించుచున్నది. పరిశోధన శాఖాధికారియగు భాస్కరరావు, వసారాలో నిలువబడి, మీవిజ్ఞప్తి యేమని యడిగెను. ఆగంతుకులు తమ చేతనున్న విజ్ఞప్తి పత్రమును భాస్కరరావు కొసంగిరి. భాస్కరరావు దానిని జదువుచు శిరఃకంపము జేయుచుండెను. కన్నులెర్రవాటి శౌర్యాగ్నికీలలను వెలువరింప మొదలిడెను. తుదకు దీర్ఘ నిశ్శ్వాసము వదలెను, తన రక్షకభటుడగు అశ్వత్థరావు నుద్దేశించి 184 అని పిలచి, ప్రథమ నివేదికా సంపుటమును దెమ్మనెను. 184 వ నెంబరుగల రక్షకభటుడు సంపుటమును గేలగొని పుటలు దిరుగవైచి, లేఖినిబూని నివేదకుల వంకజూచి యిట్లు ప్రశ్నించుచు వారి బ్రత్యుత్తరములను వ్రాసికొన దొడగెను.

"మీదే గ్రామము."

"ధనపురము"

"మీ రెవ్వరు"

"మేము వర్తకులము"

"ఈ నివేదికలో నుదహరింపబడిన పాపిశెట్టి మీ కేమి గావలయును ?

"అతడు మా జ్ఞాతివర్గములోనివాడు."

"వ్యాపారములో నతనికిని మీకును నేమయిన సంబంధము కలదా ?

"కలదు. మేము ముగ్గురము భాగస్థులము. మేము ముగ్గురము కలిసియే వ్యాపారము చేయుచుందుము.

"ఏమి వ్యాపారము."

"వెండి, బంగారు, రత్నముల వ్యాపారము చేయుదుము."

"పాపిశెట్టి బయలుదేరి పోవునప్పుడు ఎంత కిమ్మతుగల సొత్తును వెంటగొనిపోయెను."

"రమారమి యొకలక్ష రూప్యముల కిమ్మతుగల సువర్ణ రత్నములను వెంటదీసికొనిపోయెను."

"ఇప్పటి కెన్నిదినములక్రింద నతడు మీయూరు విడిచెను ?

"షుమారు రెండునెలలు కావచ్చినది?"

"పోవునప్పుడతడు ఏప్రాంతమునకు బోవుదునని చెప్పి వెళ్లెను.?"

"రాజమహేంద్రవరము సీమకుబోయి వ్యాపారము చేయుదునని చెప్పివెళ్లెను."

"ఏమైన ఉత్తరము వ్రాసెనా?"

"ఉత్తరమే లేదు. అందువలననే తత్తరపాటు. బరువు నాతడొక గుర్రముపై వైచుకొని పోయెను. నాలవనాటికా గుర్రము మాత్రమింటికి జేరినది. పాపిశెట్టిగాని, మణుల మూటగాని యేమియు లేవు"

"రెండవ పేరాలో వ్రాయబడిన రాజ్యలక్ష్మమ్మ యెవ్వరు?"

"ఆమెయు మా గ్రామవాస్తవ్యురాలే! ఆమె భర్త పేరు వెంకటపతి."

"అతడేమిపని చేయును?"

"వడ్డీవ్యాపారము చేయును." కొన్ని వేల రూపాయలు గల ప్రామిశరీ నోట్లను దీసికొని, రాజ మహేంద్రనరములోని బ్యాంకులలో నగదుచేసికొని వచ్చుటకు ప్రయాణము చేసెను. అతడుపోయిన మరునాటిరాత్రి అతనియింట దొంగలు కన్నము వైచి ఒక లక్ష రూప్యముల వెలసేయు ద్రవ్యము, వెండి బంగారు సామానులు, వస్త్రములు దోచుకొని పోయిరి. లోగడనే ఆవృత్తాంతము తమ కార్యాలయమునకు దెలుప బడినది. ఆతడును నింతవరకు దిరిగి రాకపోవుటచే, రాజ్య లక్ష్మమ్మ చాల యాతృత పడుచున్నది. ఆమెయు మీాకీ విష యమును దెలియపఱచుమని చెప్పినది. అదియే రెండవ పేరా లోని అంశము."

"మంచిది. ఆవిషయమై పరిశోధన జరుగుచున్నది. మీరు మీ ఇండ్లకు బోవచ్చును. మేము పిలువనంపినప్పుడు తత్ క్షణమే బయలుదేరి రావలయును."

"చిత్తము. అట్లే వచ్చెదము."
"మీపాపిసెట్టి వ్రేళ్ళనేమైన ఉంగరములున్నవా?"
"వున్నవి"
"వాటికేమిగుర్తు"

"ధనపురము, పాపిశెట్టి అని తెలియ జేయుటకు" ధ॥ పా॥ అను నక్షరములు ఇరువంకల జెక్కబడియున్నవి.

"మంచిది. సొమ్ము పట్టుబడినప్పుడు దానిని గుర్తించుటకు మీరు ఇచ్చటికి రావలసియుండును. పిలువనంపినప్పుడు రండు. ఇంక మీరుపోవచ్చును."

"చిత్తము"అని విజ్ఞాపకులు కార్యాలయము వదలి పోయిరి."

భాస్కరరావును అశ్వత్థరావును తమ యుద్యోగీయ వస్త్రములను సంచులలో ఇమిడ్చి మూసి, పిస్తోళ్ళు నడుగు భాగమునదాచి, సామాన్యపు రయితుల వేశములు వేసికొని చేతికర్రలను బట్టుకొని ఎద్దులబేరగాండ్రవలె సిద్ధమై, యానాటి తెల్లవారుజామున విలాసవతీ నగరమునుండి తూర్పు దెసకు బయనముసేసిరి. కొంతదూరము పోవువఱకు దూరుపు దెల తెలవారెను. క్రమక్రమముగ భానుబింబము తూర్పు కొండపై నుదయశోభను జూపెను. మ్రోలనగపడుచున్న

గోదావరితీరమున జేరి, నదీజలంబుల ముఖమార్జనముసేసికొని, నదిపై బయనముసేయ నాలోచించుకొనిరి. అంతలోఁ బడమటి దెసనుండి యొక పొగయోడ నదీజలమ్ములనటునిటు జిమ్మివైచుచు దీవ్రవేగమున దూర్పుగ బయనించుచుండెను. భాస్కరరావు చేయెత్తి రేవున నిలువబడెను. పొగయోడ తీరమునకువచ్చెను.

ఓడయజమానికిని పాంధులకును నీ సంభాషణము జరిగెను.

"మీ రేయూరికి బోయెదరు?"
"రాజమహేంద్రవరము."
"ఇద్దరును రాజమహేంద్రవరమునకేనా?
"అవును. ఇద్దరము అచ్చటికే"

"ఓడలోనికి రండు" మీకు ఓడచార్జి 8 యెనిమిది రూపాయలు అగును."

"మంచిది. అట్లేయిచ్చెదము."

ఇరువురును ఓడలో బ్రవేశించిరి. పొగయోడ తిరిగి పయనమై యేటినడుమగ బోవుచుండెను. భాస్కరరావు ఓడకొక కొనంగల యరికు ప్రక్కగా గూరుచుండెను. నది యోడకును గదికిని నడుమ సమర్చబడిన చెక్కలకు సందులుండుటచే గదిలోని ప్రయాణికులమాటలు హాలులోనున్న వారికి వినవచ్చుచుండెను. గదిలోని ప్రయాణికుల ఈసంభాషణమును, భాస్కరరావునకు వినవచ్చు చుండెను.

"సఖుడా మీ దేశ మీయేడు సుభిక్షముగ నున్నదా?"

"దేశము సుభిక్షమేగాని చోరులబాధ అధికముగా నున్నది. ప్రతిదినమునను నేదో ఒక యూరున దొంగతనము జరిగినట్లును, హత్యలు జేయబడినట్లును వార్తాపత్రికలలో వ్రాయబడుచున్నది. ప్రజ లూరూర నే రేయి నేమిసంఘ టించునోయని భీతిల్లుచున్నారు. ఈ పర్వతారణ్యములలో చోరులముఠా యొక్కటి తిరుగుచున్నదనుటకు సందేహము లేదు."

"వెఱ్ఱిమాట. దొంగలజట్టు ఒక తావున నునికిసేయుట కల్లమాట. వారినిబట్టుకొను చాతుర్యము పరిశోధనశాఖ కర్తవ్యము. ఒక యసామాన్య మైన స్త్రీ యాధిపత్యముక్రింద ఘోరకృత్యములు జరుగుచున్నవని వదంతిగలదు."

భాస్కరరావు ఈప్రసంగము నాలకించి పెదవి గఱచుకొని ఆలోచించుచుండెను.

ఓడ పయనించుచుండెను.

# హంతక చూడామణి

## నాల్గవ ప్రకరణము

"కారాగారము నంతయు బరికించితివిగదా!"

"పరికించితిని. కొట్టుకొట్టునను స్త్రీ పురుషులు బంధింప బడియుండిరి. ద్వారమునొద్ద రక్షకస్త్రీలు వారిని గాపాడు చున్నారు."

"చూచితివిగదా! వీరి గృహములను అంగళ్ళను గొల్ల గొట్టి, వీరిని తెచ్చి యిందు బంధింపజేసితిని. వీరియొద్దనుండి సంగ్రహించిన ద్రవ్యముచేతనే యీ పాతాళరాజ్యము సృష్టి యైనది. ఈసంఘములో పనిచేయవలయునన్న తొలుదొల్త సందేహరహితముగా హత్యచేయుట నేర్చుకొనవలయును. హత్యాచరణమే మొదటిపరీక్ష. కావున నీవు 20 వ సంఖ్యచే గుర్తుచేయబడిన సాలకుబోయి యందున్న వర్తకుని పిస్తో లుతోగాల్చివేయుము. అతడు ధనపుర నివాసియగు పాపిశెట్టి. అతనియొద్ద లక్షరూప్యముల విలువగల సొత్తును సంగ్రహించి తిమి. అతనినిగురించి పరిశోధకులు బయలుదేరినారు. అతడు సజీవుడై యున్నచో మనప్రయత్నములకు భంగము కలుగును. త్వరలో వాని నంతమొందించుము. ఇదిగో పిస్తోలు. నేనును నీవెంటనే వచ్చెదను." అని పిస్తోలు నొసంగెను.

అంత వారిరువురును దశమారి వెంటనంట కారాగార ములకు బోయిరి. పాపిశెట్టి కాలుసేతులొక కంబమునకు గట్ట

పడి యుండెను. మారిణి ఊఁ అనియెను. శతమారిణి "ఢాం" అను మ్రోతమ్రోయ పాపిశెట్టిపై గుఱిచేసి పిస్తోలుగాల్చెను. తరువాత యిరువదియైదవ యంకె గుర్తుగల చెరసాలకు బోయి దశమారిణీ నీవీ వెంకటపతిని గాల్చుమనెను. పిస్తోలు వెంకటపతికై గుఱిచేసి "ఢాం" అనునట్లు దశమారిణి వెంకటపతిని గాల్చెను. మారిణి యప్పుడొక ఈలవైచెను. శ్యామలయు మఱికొందరు భృత్యురాండ్రును వచ్చిరి. మారిణి చెరసాలల తలుపులు దెఱపించి. మీకృత్యమును యథాప్రకారము నిర్వహించుడని భృత్యురాండ్రకు జెప్పెను. వారా శవములను మోసికొనుచు, అంతర్భవనమునందున్న సొరంగము ద్వారమున బోయి. గోదావరీజలములో పాఱవైచిరి. తిరిగి వచ్చునప్పుడు లోపలినుండి బిలముఖము నొకరాతితో మూసి వచ్చిరి. కొందఱు పరిచారికలు చెఱసాలను శుభ్రపరచి యెప్పటియట్ల ముఖద్వారములను మూసివచ్చిరి.

ఆవెనుక సహస్రమారి సర్వ సహచారిణీ వర్గముతో సభాసదనమున గొలువుదీర్చెను. సహస్రమారి తన సహచారిణీ వర్గమవలంబింప వలసిన ధైర్య సాహసములను గుఱించియు, వారివారి విధికృత్యములను గుఱించియు నొక యుపన్యాసము చెప్పెను. అందఱును మారిణీమండలికి జేయ్ అని నినాదములు చేయుచు కరతాళధ్వనుల గావించిరి. అంత సహస్రమారి శతమారి నుద్దేశించి, మహిళామణీ! నీవన్నివిధముల సమర్థురాలవు. ఈమండలికి నిన్నుపాధ్యక్షురాలినిగ నియమించుచున్నాను. మనజీవితములు క్షణభంగురములు, భాస్కరరావను పరిశోధన శాఖాధికారి అపరాధ పరిశోధనకై

తాను స్వయముగ బయలు దేరెనని తెలియుచున్నవి. నేనాతని నెట్లైన యంతమొందించెదను. ఒకవేళ దైవవిధిచే నేనాతని చేతిలో మ్రగ్గితినేని, నావెనుక నీవీయధ్యక్షపీఠమునలంకరింపవల యును. మారిణీమండలియొక్క పేరు నిలువబెట్టుటకు నీవే సమర్థురాలవు. అనిపలికి ఉపాధ్యక్షురాలు శతమారికి జేయ్ అని హెచ్చరిక నినాదములు చేయించెను. కొందఱు సభ్యురాండ్రు పూలమాలికలదెచ్చి శతమారిణి కంఠమున నలంకరించిరి. మఱికొందరు. మొగమున గుంకుమ పెట్టిరి. కొందఱు నీరాజనములెత్తి వీర రసోద్బోధకములగు పాటలు బాడిరి. అందఱును దమ తమ తావుల గూర్చుండి యుపహార పానీయముల స్వీకరించిరి. సభ్యురాండ్రు తమ స్థానములకు బోయిరి. సహస్రమారి శతమారికి బెక్కువిషయముల బోధించుచు, పాతాళగృహమునగల యన్ని రహస్యములను దెలియ జూపుచుండెను. తుదకు మఱునాటి కర్తవ్యమును గుఱించి యాలోచించుచు, నామె తనయుపాధ్యక్షురాలికి జెవిలో నేమిమో రహస్యముగ జెప్పెను. శతమారి శిరఃకంపము గావించెను.

ఆ సమయమున కరదీపము బట్టుకొనిన యువతి త్రోవ జూప, రక్షకభటులొక పురుషుని బంధించి తీసికొనివచ్చిరి. వారివెనుక కొలది యెత్తును పెద్దబారునుగల యొక యశ్వరాజమును నుండెను. వీరెల్ల మారిణిమ్రోల నిలువబడి వందనము సేసిరి. మారిణి శతమారివంక జూచి కర్తవ్యము గావింపుమని కనుసంజ్ఞచేసెను. ఉపాధ్యక్షురాలు వీరిని జెఱసాలకు గొంపోయి బద్ధపూరుషుని శూన్యముగానున్న యఱలోనుంచి ద్వారము బంధింపజేసెను. అశ్వరాజము నశ్వశాలలోనికి

గొంపోయి, తగుతావున గట్టించి యశ్వరక్షకుల కప్పగించెను. పాంథునియొద్ద నిగ్గుకొనిన ద్రవ్యమును మాలిణియెదుట నర్పింప చేయు నామె దానిని భద్రపఱచెను.

సాయంసమయ మగుటచే పర్వతోపరిభాగమున వృక్షశాఖల జేరు విహంగములు కలకలారవములు సేసెను. జగత్త్రయము నందలి పాపపుంజమునకు బరిణామ రూపము వలెనున్న కటిక-చీకటి గుహాంతరాళముల నావరించెను. పరిచారికలు ఆయా తావుల దీపికల వెలిగించిరి.

వంతుల ప్రకారము కొందఱు గుహాంతరాళమును గాపాడ నియమింపబడిరి. కొందఱు స్త్రీపురుషులు దోపిడికై దేశముపై బయలుదేరిరి. కొందఱు తమతమ విశ్రాంతి గృహములకేగి విశ్రాంతి గైకొనిరి. భవన రక్షణమునకొఱకు పర్వతశృంగమున నేర్పఱుపబడిన రహస్యస్థానమున నొక్క భటుడు దూరదర్శన యంత్రమును గైకొని తన సాంకేతి స్థానమున ప్రవేశించి నలువంకల బరీక్షించి చూచుచుండెను. సర్వరక్షణోచితములైన యేర్పాటుల నన్నిటిని జేసి, శతమారి తనకై నియమింపబడిన శయనాగారమునకు బోయి నిరువంకల మరశతఘ్నులను బెట్టుకొని విశ్రాంతి గైకొనుచుండెను.

---

# హాంతక ప్రాదొవాలి

## అయిదవ ప్రకరణము.

గోదావరీ తీరమున అత్యంత శోభావిరాజమానంబగు రాజమహేంద్రవరము గొప్పవర్తకస్థానమని చదువరులెఱుంగని యంశముగాదు. విశాలములగు రాజవీధులును, ఉత్తుంగములగు సౌధరాజములును, ప్రేక్షకులకు గన్నుల పండువు సేయును. రాధారీపడవల రాకపోకలు నదీతీర సౌభాగ్యమును బెంపొందించుచుండును. సాయంసమయమున, నవయువకులు తీరోపాంతములజేరి విహారగాయనముల మాధుర్యములు వెలువరించుచు ప్రేక్షకులకు మనోరంజనము సేయుచుందురు. నదీతరంగముల యలజడికి జనించు మందమారుతములు అందు విహరించు మానవుల సౌఖ్యము నినుమడింపజేయును. ఆంధ్రరాజుల కాలమున నీనగరము అనల్పరాజకీయ ప్రాముఖ్యము కలిగియుండెడిది.

పెద్దబజారున, వివిధములైన విలువలుగల వలువలు, పలువిధములైన గృహోపకరణములు, రకరకముల వెండి సామానులు, కాలోచితములైన పసిడిసొమ్ములు, రత్నఖచితములైన నూపురాది భూషణములు లభించు పెద్దయంగడులు గలవు. షరాఫువర్తకులు బంగారమును మణులను గొనుటయు నమ్ముటయును జరుగుచుండును. నడిబాజారునగల యొక పెద్ద

యంగడిలో నొక వర్తక ప్రముఖుడు కూర్చుండియుండెను. అనేకులు వస్తుక్రయ విక్రయములు సేయువారు వచ్చిపోవు చుండిరి. సాయంకాలము పొద్దుక్రుంకునంతవఱకు గంభీర పురుషుడనదగిన యొకవ్యక్తి తంగణాగుర్రముపై నెక్కి వచ్చి యంగడిమ్రోలదిగెను. పరిచారకాకారులు గుఱ్ఱమును గళ్ళెముతో బట్టుకొనిరి. ప్రధానపురుషుడు అంగడివేదికపై కెక్కి యాహ్వానింపబడి చూపబడిన తావున గూర్చుండెను. ఈ వ్యక్తి శీర్షము, జరీయంచుల రామణీయకముగల పాగాతో నలంకరింపబడి యుండెను. అసాధారణములును, నసహజగాంభీర్యద్యోతకములునునగు మీసములు, మూతి నలంకరించు చుండెను. యురస్థలము విశాలమై యున్నతముగనుండెను. నడుము కొంచెము సన్నగనేయుండెను. సామాన్యమానవుల కతీతమైన కోమలత్వము ముఖముపై విరాజిల్లుచుండెను. నాలుగు వేళ్ళకు రత్నఖచితములైన బంగారు టుంగరములుండెను. దృష్టులు పలుమాఱు ప్రక్కకు దిరుగుచుండెను. పరిచారకులను గుఱ్ఱమునుజూచు నెపమున మాటిమాటికిని నా వ్యక్తిచూపు నడివీధిపై కరుగుచుండెను. తెచ్చిపెట్టుకొనిన చిరునగవుతో వర్తకప్రముఖునితో నిట్లు సంభాషింపఁ దొడంగెను.

"స్వామీ ! ఏమి బేరము ?"

"ఈసాలునకు మాప్రాంతమున బంటలు తరుగుబోవుటచే ద్రవ్యమున కించుక లోపము వాటిల్లినది. ఈనాయుంగరముల రెంటిని విక్రయించి ధనము గైకొనవలయునని వచ్చినాను."

"ఆయుంగరముల నిట్లుచూపుడు."

"ఇవిగో యుంగరములు." అని తనవ్రేళ్ళ రెండుంగరములను దీసి షరాపుచేతికందించెను.

ఆక్షణమున నాజానేయాశ్వము నధిరోహించిన యొక భూస్వామి యిరువురు సహచరులతో నచ్చటకరుగుదెంచెను. ఆతడీ బేరమాడు వ్యక్తివంక గన్నుదెఱచి చూచి యత్యుత్సాహము నభినయించి, యేమిబేరము జరుగుచున్నదని షరాపునడిగెను. అతడాయుంగరములను భూస్వామిచేతికిచ్చి ఇవి యమ్మకమునకు వచ్చినవి. మీరు క్రయమునకు దీసికొందురా? సొగసుగానున్నవియని ప్రశ్నించెను. బేరగాని గుండె కొట్టుకొనుచుండెను.

భూస్వామి. ఈయుంగరములను మీరేలఅమ్మజూపుచున్నారాయని యా వ్యక్తినడిగెను,

"అప్పటికి వేఱునుపాయములేక, నేనే అమ్మజూపితి ననెను."

"ఇవి మీ యొద్దికెట్లువచ్చినవి"

"అది నీకు సంబంధించిన యంశముగాదు." కావలసినచో వెలసేయుము. లేనిచో మిన్నకుండుము."

భూస్వామి. యా యుంగరముపైని ధ॥ పా॥ అను నక్షరములను గుర్తించి "ఈయుంగరము ధనపురం పాపిశెట్టికి సంబంధించినది. ఇది నీకెట్లువచ్చెనో చెప్పుము."

ఆవిషయము నేను జెప్పజాలను. నేనిది చిరకాలము కిరింద క్రియము నొందితిని. ధన్యవాదం పార్వతీశంగారి దేల కాగూఢము.?

"అట్లయినను ఋజువు భారమునీపై నున్నది."

"అవసరమైనచో నట్లే ఋజువుపఱచెదను. ఇప్పుడు నీతోవచ్చిన నీవుపొమ్ము నీకర్తవ్యము నీవుచేసికొనుము"

"నాకర్తవ్యము నిన్ను పరిశోధన కార్యాలయమునకు గొనిపోవుటయే." అని భూస్వామి దుస్తులనుమార్చి భాస్కరరావయ్యెను. అతని యనుచరుడు అశ్వత్థరావు రక్షకభటాకృతి దోప సంచిలోని దుస్తులను, దాల్చి పిస్తోలు చేతబట్టుకొని యా వ్యక్తిని నిర్బంధముగా విలాసవతీనగరము పరిశోధనాలయమునకు గొనిపోయెను.

అశ్వత్థరావును ఇతర భటులును నా వ్యక్తిని కారాగారమునం దుంచుటకు బూర్వము దుస్తులను దీయింపగా, బేరగాడు యొక గంభీరాకృతిగల స్త్రీయయ్యెను. అనుమానముపై నిర్బంధింపబడిన వ్యక్తియగుటచే నామె నంతకంటె నేమియు బరిశీలింపలేదు. ఆమెయొద్దనున్న సంచినిగాని, అందులోని ఇతరపదార్థములనుగాని వారు పరిశీలించిచూడలేదు. ఆరేయి యామెకు ఆహారము నొసంగజేసి, కారాగారములో నుంచిరి. భాస్కరరావు మాండలికాధికారి పనుపున రాజమహేంద్రవరముననే యుండెను. రక్షక భటుడొకడు విలాసవతిలోని కారాగారమును గాపాడుటకు నియమింపబడి యుండెను. అతడు రేయి రెండుజాములవఱకును మెలకువతో

నుండి కొంతవడికట్లే నిలుచుండి నిద్రావృతుడై స్మృతిదప్పి యుండెను. నడిరేయి దాటినవెనుక సహస్రమారి తనసంచి లోని యాకురాయిని దీసికొని మెల్లమెల్లగా ద్వారపు గొళ్ళెమును గోసి, తలుపు తెఱచి బైలుపడి, తిరిగి తలుపు చేరవైచి, రక్షకభటుని తన సాధనముతో బొడిచి చంపి, నావరణము దాటి, యారాత్రి గోదావరీతీరమును జేరెను. అచ్చట తన వస్త్రములను మార్చి యొక యోగినివేషము వేసికొని తెల్లవారు జామున నదిలో బయనమగుచున్న యొక పొగయోడలో నెక్కి, సూర్యోదయమగువఱకు భద్రాచలము చేరుకొనెను. అందొక గుట్టవెనుకనున్న యొక తపస్వియొద్ద శుశ్రూషచేయుట కంగీకారము నార్జించి క్రమక్రమముగా దాను నొక తపస్వినివలె నటించుచు, కైతవమార్గమున గాలయాపనము సేయుచుండెను. వేఱొక గుహానాలయముగ జేసికొనెను. ప్రజలలో నొక నూతన తపస్విని వచ్చెననియు, సర్వరోగములను నివారణసేయుననియు వదంతు బుట్టెను. వివిధరోగములుగల రోగులు ఆమె నాశ్రయించి, విభూదులు, రక్షరేకులు, క్రియలు, మందుటాకులు గైకొనుచు దమతమ అక్కఱలను దీర్చుకొనుచుండిరి. సహస్రమారి తనమందుల సంచిలోనున్న పిస్తోలును మాత్రము జాగ్రత్తతో గాపాడుకొనుచుండెను.

---

# హంతక చూడామణి

## ఆరవ ప్రకరణము.



శతమారి తన యజమానిని గుహాంతరాళమును వదలిన క్షణమునుండియు భావికర్తవ్యము నాలోచించుచుండెను. ప్రతిరాత్రియందును నేదో యొక నగరమున దోపిడిలు చేయించుచు ధనమును గూడబెట్టుచునేయుండెను. తన దోపిడిగాండ్రజట్టును పదిభాగములుచేసి, పదితావులకు బంపి పది రహస్యస్థావరముల నేర్పాటుచేయించెను. కాళేశ్వరము, చెన్నూరు, ఆహిరి, ఓరుగల్లు, రామగిరి, మున్నగానగు స్థానముల కనతిదూరమున నున్న కొండలలో గూఢస్థానముల నేర్పఱచుకొని దోపిడిగాండ్రు పవలెల్ల సంచారముచేసి యాచోకీలు తీసికొని రాత్రులయందు బందిపోట్లు, కన్నములు, సాగించుచు నపారముగ ధనము దోచుకొనుచుండిరి. ఏనాటి కానాడు పాపికొండల పాతాళసదనమున నున్న శతమారి యొద్దకు వార్తలు వచ్చుచుండెను. వార్తలదెచ్చినవారి మూలముననే జట్లయధిపతులకు శతమారి వార్తలనందజేయుచుండెను. దోపిడి ధనమును సర్వమును నొక్కతావున ప్రోవు చేయింపక సురక్షితములును, సుగూఢములునునగు భూగృహములు నాలిగింటియందు మాత్రమే నిలువజేయించి, కేంద్రస్థానమగు తన తావుననేమియు లేకుండ జేసికొనెను. మూడునాలుగు దినములవఱకు మారిణి పరిశోధనోద్యోగికి

జిక్కెనని యనుచరులచే తెలిసికొనెను. వెంటనే ఆమెయు నాస్థానమునుండి మఱియొక తావునకు జేరుట యుచితమని యూహించెను.

చిరకాలమునుండి పాతాళగృహమున బంధింపబడి యున్న ముప్పదిమంది స్త్రీ పురుషులను దయాశూన్యముగ పిస్తోళ్ళతో గాలిపించి, వారిశవములను సారంగము మార్గమున గోదావరీ జలములలో గలిపించెను. తానును రేపో మాపో యాకేంద్రస్థానమును విడుచుటకు చెప్పులలో ప్రయాణము పెట్టుకొనియుండెను.

దేశమునందంతట అలజడి వ్యాపించెను. ఏదో ఒక చోట దోపిడియో దొంగతనమో జరిగెనను వార్త మాండలిక పరిశోధన కార్యాలయమునకు వచ్చుచుండెను. రాజధానీ నగరమగు ధాన్యకటకమునుండి పెక్కుసారులు తంతివార్తలు రాజమహేంద్రవరమునందలి కార్యాలయమునకు వచ్చుచుండెను. అపరాధపరిశోధనము కొఱకు మఱి ఏబది మందిరక్షక భటులను, యిరువదిమంది గూఢచారులను రాజమహేంద్రవరమునకు ధాన్యకటకమునుండి పంపబడిరి. ఏక్షణమున నేమి యుత్తరువు వచ్చునోయని యధికారులును, ఏక్షణమున నేమి దోపిడులు జరుగునో యని ప్రజలును భీతిచే దుకదుక లాడుచుండిరి.

అట్టితఱి ఒకనాటి సాయంకాలమున మాండలిక శోధనాధికారియగు కళ్యాణరావును, విలాసవతీ కార్యాలయాధికారియగు భాస్కరరావును, రాజమహేంద్రవరమున గోదా

వరీ తీరమున విచారణార్థముగ బోయియుండిరి. తమప్రోల పల్లెవాండ్రు నామబోటులపై నుండి వలల నొగ్గుచు చేపల బట్టుచుండిరి. అప్పుడొక్క పల్లెవాని వలలోని కొకశవము చిక్కికొనెను. అతడు దానిని తీరమునకుజేర్చి యందున్న భాస్కరరావు కళ్యాణరావుల యెదుట నుంచెను. ఇతరులగు పల్లెవాండ్రెను బ్రోత్సహించి పెక్కుమారుగు వలలవేయిం చిరి. క్రిమక్రమముగ నిరువది శవములు చిక్కెను. ఉద్యోగీయులు రాజకీయ వైద్యులనుబిలిపించి, పరీక్షలు చేయించగా, నన్నిశవములును పిస్తోలుదెబ్బలచే నీల్గినమానవులవని విశద మయ్యెను. కొన్నిశవముల మెడలయందు ఇది శతమారి సాహసకృత్యమని వ్రాయబడి తాటియాకుల చీట్లుకట్ట బడి యుండెను. అట్టితఱి వారి తహతహలకు మేరలేకుండెను. వెంటనే భాస్కరరావు ఇదువురు రక్షకభటులను వెంట దీసి కొని, పాపికొండలప్రాంతమునకు వచ్చెను. శతమారి తన యనుచరులకు తగునుపకరణములనిచ్చి, పరకీయులెవ్వరువచ్చి నను కాల్చివేయుటకు సంపూర్ణాధికారములనిచ్చి తానును తగు జాగరూకతతో నుండెను. కనుమలో గనుగొన్న మాన వుల యడుగుజాడలను, గుఱ్ఱపుటడుగులను బరీక్షించి. ఈ ప్రాంతమున నొక దొంగలజట్టు ఉండవలయునని నిశ్చయిం చుకొనెను. దొంగల యధిపతిని బట్టుకొని, ప్రజలలో శాంతి నెలకొలుపుటయో ప్రాణముల గోల్పోవుటయో జరుగవలె నని భాస్కరరావు కృతనిశ్చయుడై యుండెను.

భాస్కరరావును, నతని సహచరులును రెండుపర్లాం గుల మేరలో నగుపడునంతనే శతమారి యీ సమాచార

మును దెలిసికొని "యాతనిని గుహాలో ప్రవేశపెట్టి వికలాంగుని జేసి బంధింపవలయునని తన యనుచరుల కావతియొసంగెను. భాస్కరరావు ముఖద్వారమునగల రాతికడ నిలువగనే, యాపెద్దమూతశిల తెఱువబడెను. గుహాంతరాళము పెద్దశిబ్బందితో నిండియుండునని భాస్కరరావూహింపలేదు. ఎట్లైనను జోరుల నందుకొనవలయునను నిశ్చయమే గాని, తనజీవిత మేమగునోయను భీతి యించుకయు నతనిచిత్తము నావరింపలేదు. ఇరువురుఅనుచరులతో లోనికి బ్రవేశించెను. త్రోవయెల్ల గాఢాంధకారమయముగానుండెను. పదియడుగులతి సాహసముతో ముందుకు వేయగనే, త్రోవప్రక్కల రాతిగూడులలో డాగియున్న చోర సంతతి యొక్కమ్మడి సమీపించి వారి బాహువులను వెనుకకు విఱిచికట్టిరి. తప్పికొను పెనుగులాటలతోను ప్రయోగము లేకపోయెను. ఒక్కొక్కని నలుగురు నలుగురు చుట్టుకొని, అప్పుడు చిన్న కరదీపముల జూపుచు శతమారి కార్యాలయమునకు గొంపోయిరి. శతమారి కార్యాలయమున నమర్చబడియున్న మారణాయుధములజూడ, భాస్కరరాయని గుండెసాహస మొక్కింత డిందయ్యెను. క్షణమాత్రమున శతమారి యాజ్ఞను దెలిసికొని వారి ముగ్గురను జోరులు వేఱువేఱు చెఱసాలలో బంధించిరి. అవమతికొఱకు వారిబారుకేశములు తలయంటగత్తిరింపబడెను.

రెండు దినములు గడచెను. బోనులలోని సింగములకు నాహారమును విసరినట్లు, చోరులు బంధితుల నిలయముల లోనికి రొట్టెముక్కలనువిసరుచు, నీటి గిన్నెలనందించుచు,

కఠిననిర్బంధావాసము ననుభవించిరి. నాలుగవ యరలో నున్న నిర్బంధితుని దినదినమును బయటికిదీసి, కొరడాలతో గొట్టుచు తన యాభిలాష నెరవేర్చుట కంగీకరించునంతవఱకు దండించుచుండుడని యనుచరచోరుల కాజ్ఞాపించి, శతమారి యా స్థావరమునువీడి మఱొకగూఢస్థానమును జేరుచుండెను. ఇచ్చటి వ్యవహారములను సవరించుటకు దగిన జట్టునుమాత్రమిందు వదలెను.

శతమారి బయలుదేరునప్పుడు జట్టుపెద్దను బిల్చి యాతనిచెవిలో మెల్లగ నేను——అనుతావున కనతిదూరమునగల మన గూఢస్థావరమునకు బోవుచున్నాను. ఈవిషయమును గూఢముగనుంచి, యనుదిన కార్యక్రమమును నాకు దెలియజేయుచుండుమని యల్లనజెప్పెను. మట్టితో తన యాకృతిగల మట్టిబొమ్మ నొకదానిని సృష్టించి దానికి దగిన రంగు వేయించి, తాను దినమును గట్టుకొను చీరవంటి చీర గట్టి శయ్యాగారమున సెజ్జపై బరుండబెట్టి నిండార నొక సాలువ గప్పించి యుంచెను. అర, గోడ నొకబాకుమాత్రము దగిల్చి యుంచెను. ఈ ఏర్పాటుచేసి, శతమారి నడిరేయి పయనమై తన యంగరక్షకులతో బోవుచుండెను. తూర్పు తెలవారువఱకు శతమారి తన గమ్యస్థానమును సురక్షితముగా జేరుకొనెను.

---

# హంతక చూడామణి

## ఏడవ ప్రకరణము

మూడవనాడు నడిరేయిని, నాలవచెఱసాలలోనున్న నిర్బంధితుని మూలుగులు, గోడసందులలోనుండివిని, భూత దయాపరుడగు భాస్కరరావు, మిక్కిలి జాలిపడి యాతనితో నిట్లు భాషించెను.

"బాబూ నీ దేయూరు"

"అయ్యా! నాది రత్నాపురము"

"నీవిచ్చట నిర్బంధింపబడి ఎంతకాలమైనది.?"

"రమారమి యొక నెలదినము లయినది."

"నీవెట్లు చిక్కుపడితివి"

"నేను రత్నముల వ్యాపారముచేయుచు గోదావరీ తీరమున బల్లెలలోను, పట్టణములలోను, సంచారము చేయు చుంటిని. పొగయోడలో బ్రయాణము జేయవలయునని ఈ రేవున నేను, నారత్నములసంచి తలక్రింద బెట్టుకొనిపండియుం డగా, మార్గాయాసమువలన నాకు నిదురపట్టినది. ఈసమయ మున నొంటరినైయున్న నన్నుగని, నలువురుచోరులు నా కాలుసేతులు బంధించి, యిచ్చటికి దీసికొనివచ్చి బంధించిరి. నారత్నములమూట చోరులపాలైనది. నాటినుండియు దొం

గలజట్టున కధికారిణి యగు యువతి నన్ను దమలో గలియు మని నిర్బంధపెట్టుచువచ్చినది. నేనందుల కంగీకరింపలేదు. కొన్నినాళ్ళు, "నీవు నాతో మైత్రిచేసి, నన్ను పెండ్లిచేసి కొనుము. నీకు సర్వసుఖములును గలుగజేసెదనని హెచ్చ రించినది. నేనెందులకును సమ్మతింపలేదు. నాగట్టితనమును జూచి యామె నన్ను దినదినమును బయటికిదీసి ఇనుపదండ మున కమరింపబడిన కొరడాతో గొట్టింప మొదలుపెట్టినది. కొరడాదెబ్బలైన దినదినమును దినుచుంటినిగాని యామెకు నేను లోబడలేదు. నేను ఆమెకులోబడునంతవఱకు ప్రొద్దు నను సాయంకాలమునను రెండువేళల కొరడాలతో కఠిన ముగా గొట్టుచుండ వలయునని అనుచరుల కానతియొసంగి నది. ఈదొంగలతో గలిసి, తుదకు మానముగోల్పోవుట కంటె మృత్యువే మేలని నిశ్చయించుకొని, ప్రాణముపై నాశవదలి, యిందిట్లు పడరాని బాధలు పడుచున్నాను. మన కేదైన తరణోపాయమున్నచో నాలోచించుడు."

"నిన్ను గొట్టుచున్న కొరడా యినుపదండముపైతము గలిగియుండెనా"

"అవును. దానితో నన్ను బలముకొలంది గొట్టి, మఱుసటిదినముకొరకు ఈకొరడాను నీవే భద్రపఱచవలయు" నని దీనిని నాకొట్టునందేయుంచి పోవుచుందురు."

"బాబూ! ఆకొరడాను ఈగోడ కిటికీక్రింది సందులో నుండి నాకందించుము. త్వరలోమనము బయలువెడలు నుపా

యము చేసెదను. చోరులు తిరిగి రాకముందు మనము కార్యము నెరవేర్చవలయును. త్వరసేయుము.

"ఇదిగో, సెలకోల. తీసికొనుము" భాస్కరరావు. యినుపదండముగల సెలకోలను దీసికొని దానిసాయముతో నాలుగవ చెఱలోనున్న విశ్వేశ్వరరావు కొట్టులోని కెగ ప్రాకెను. శీఘ్రముగ దానితో నాలవచెఱసాల ద్వారమున సడలియున్న భాగమున ద్రివ్వి వెంటనే ద్వారాధారములను గోడనుండి యూడబెఱికి ద్వారమును తెఱచెను. ఇరువురును బయటికివెడలి తొలుత. శతమారి శయనాగారమునకు బోయి చూచిరి. ఆమె నిదిరించుచున్నదని నిశ్చయించుకొనిరి. తలుపు వెలపల బిగియించి యుండెను. గొళ్లెముదీసి లోనికిబోయి యా గదిలోని గోడవంకెలకు వ్రేలాడుచున్న తాళముచెవులును, బాకును నిశ్శబ్దముగదీసికొనిరి. భాస్కరరావా బాకుతో కృత్రిమ శతమారిదేహమున బొడిచెను. గుహాయందంతట నిశ్శబ్దతయేగాని చప్పుడు లేకుండెను. వెంటనే. మిగిలిన తన యనుచరులున్న చెఱసాలల ద్వారములదీసి వారిని వెలువరించెను. నలుపురును గలిసి. గోదావరీ ముఖమునకు వ్యాపించియున్న సొరంగములో బ్రవేశించి. గౌతమిరొడ్డున కొక్క పరువున జేరిరి. ఆసమీపస్థానమున నిదురించుచున్న పల్లెవానిని నిదురలేపి, వాని పడవపై నెక్కి రివ్వురివ్వున దెడ్లువైచుచు గోదావరి యావలిరొడ్డునకు జేరిరి, ఆపల్లెవానికి దగిన ద్రవ్య మొసంగి. నీ సహాయమింకను గావలసియున్నదని వానికి నమ్మ జెప్పి వానిని పూర్వస్థానమునకు బంపివైచిరి.

విశ్వేశ్వరరావును యథేచ్ఛంబంపివైచి, ఇరువురు రక్షక భటులతో భాస్కరరావు సంజవేళకు రాజమహేంద్రవరము చేరెను. ముగ్గురకును నుదయమునుండి యాహారము లేకుండెను. ఐనను దొలుదొల్త సూటిగా మాండలిక పరిశోధన కార్యాలయమునకు బోయి కళ్యాణరావుకీవార్త యంతయు దెలిపిరి. అతని యనుజ్ఞదీసికొని యనుచరులను వారియిండ్లకు బంపెను. మఱియొక రక్షకభటుని వెంటనిడుకొని భాస్కరరావు భోజనపు హోటలును వెదకికొనుచు బజారులోనికి బయనమయ్యెను.

ఆ కొలదికాలములో కాళ్యాణరావునకును భాస్కరరావునకును యీాప్రసంగము జరిగెను.

కళ్యాణరావు "జట్టుజాడ దొరకినదా"

దొరకినది. నాయకురాలిని జంపవలసి వచ్చినది. తొలుత నేను జిక్కుపడి, ఎట్లో తప్పించుకొని, దానినంత మొందించి, యిచ్చటికి జేరితిని. కాని చేయవలసిన కార్యమెంతయో గలదు."

"మంచిది నీవు ఆహారముగైకొని విశ్రాంతిదీసికొనుము. తెలవారినవెన్క కర్తవ్యము నాలోచింపవచ్చును.

భాస్కరరావు ఆకలిముఖమున పెద్దబాజారున అన్నవిక్రయశాలకుబోవుచుండెను. ఒక మేడ హాలున దేవేంద్రభవనము అని పెద్ద ప్రకటన వ్రాయబడియుండెను. దానిపై కాఫీ భోజన భవనమూఅని పెద్ద అక్షరములతో వ్రాయబడియుండెను. రెండవ పంక్తిలో చిన్నఅక్షరములతో "అన్ని

రకముల ఫలహారములు ఇచ్చుట దొరకును.” అని వ్రాయబడియుండెను. రాజమహేంద్రవరములని క్రింది పంక్తిలో గుడివైపున వ్రాయబడియుండెను.

నడుమనొక హాలును దానిచుట్టును జిన్నగదులును నుండెను, హాలులో ననేకములైన బల్లలు కుర్చీలు అమర్చబడి యున్నవి. విద్యుత్ శక్తి ప్రేరితములైన వీవనలు దిరుగుచుండెను. పలురంగుల విద్యుద్దీపములు భవనమును శోభావినిద్రము జేయుచుండెను. పరిచారికలు నీరముల పాత్రలుదెచ్చి యిచ్చుచుండిరి. కొందఱు ఫలహారముల పళ్ళెరములు దెచ్చి పెట్టుచుండిరి. కొందఱు కాఫీరసమును దెచ్చియిచ్చుచుండిరి. ఇద్దరు పరిచారికలు త్రోవఁబోవు బాటసారులను బిలిచి, లోనికి బ్రవేశపెట్టుచుండిరి. భవనమంతయు నవిరామముగ మానవ కంఠస్వరములతోఁ బ్రతిధ్వనించుచుండెను. యజమానిని తలవాకిట నొక మేజుమ్రోల కుర్చీపై గూర్చుండియుండెను. భాస్కరరావును భటుడును పరిశోధన శాఖోద్యోగీయుల దుస్తులతో లోనికి బ్రవేశించు నప్పుడు శతమారి యాతని నిలువెల్ల నొక్కసారి ఎగదిగ జూచెను. ఈతడెవ్వరని పరిచారికనడుగ నామె ఈయనభాస్కరరావు అను విలాసవతీ నగర పరిశోధనోద్యోగియని చెప్పెను. అప్పుడప్పుడు విలాసవతిలో నైతము జూచినట్లు జ్ఞప్తికివచ్చుటచే నాయజమానిని యాతని దటాలున గుర్తించెను. మఱియొకసారి తలవాల్చియే ప్రక్కచూపున నతని వంకజూచినంతనే, నతని శిరోవేష్టనము క్రింద నల్లాడు గిరజాలు గనబడెను. అవి సక్రమముగ లేకుండుటచే వానినవమాన చిహ్నముగ గుర్తించెను. భాస్కర

రావు యజమానిని బల్లదాటి హాలులోనికి బోవునప్పు డామె నొక్కపరి యవలోకించి పూర్వపరిచితురాలివలె ననుమానించెను. గాని యామెను గుఱించి యింకను స్థిరభావము చెందలేదు. అంతలో ఢాం అను శబ్దము వినబడెను. భాస్కరరావు ప్రక్కనుండి గుండు దూసుకొనిపోయి రక్షకభటుని వక్షమున దగులటచే నతడు జీవము విడిచెను. భాస్కరరావు చెవులు దిమ్ముపోయి నేలపై కొరగెను. భాస్కరరావు స్మృతి గోల్పడెను. దేవేంద్రభవనము సింహద్వారము వెంటనే మూతవేయ బడెను. యజమానినియు పరిచారికలును నాలసింపక దుస్తులు మార్చుకొని గూఢనివాసము కొఱకు ఏర్పఱచుకొనిన మఱొక గృహాంతర్భాగమునకు బోయి, యక్కడనుండి నియమిత గూఢగిరిగహ్వరస్థావరమునకు జేరిరి. యజమానిని తెల్లవారువర కొక్కయశ్వముపై స్వారిచేయుచు నక్కడకు యిరువదినాలుగు మైళ్ళ దూరములోనున్న మఱి యొక పర్వతాంతర్భాగమునకు జేరెను.

రాత్రి ప్రొద్దుపోయినతరువాత వచ్చిన జనులెల్లరు దేవేంద్రభవనము సింహద్వారము మూయుబడియుండుటం జేసి తిరిగిపోవుచుండిరి. తెల్లవారుజామున భాస్కరరావు తెలివిదెచ్చుకొని, అవురా యెంతమోసము! ఈ భవన యజమానినియే శతమారి కావచ్చునని పెదవి కఱచుకొనెను.

తూర్పుదెస తెలవారుసమయమున, భాస్కరరావు సింహద్వారము తలుపు చప్పుడు చేయగా బాజారున బోవు వారును లోనికివచ్చి, రక్షకభటుని శవమునుజూచి, విభ్రాంతి

చెందిరి. ప్రజలీవార్తను కళ్యాణరావునకు దెలుపగా, నతడు రక్షకభటరాజితోడ, నొక యశ్వశకటముపై నచ్చటి కరుదెంచెను. తూలితూలి వ్రాలుచున్న భాస్కరరావు అశ్వశకటము నధిరోహించెను. రక్షకభటులు ముందుబోవుచుండ కళ్యాణరావు భాస్కరరావును పరిశోధనకార్యాలయమునకు గొంపోయి, యచ్చటికి సమీపముననున్న వైద్యుని బిలిపించి యతని కౌషధమిప్పించెను. సూర్యోదయానంతరము జాము ప్రొద్దెక్కినంతవఱకు భాస్కరరావుకు శరీరాయాసముతగ్గి, మనస్సు స్థైమిత్యము నందెను. దేవేంద్రభవనమునకు రక్షకభటులనుబంపి పడియున్న శవమును స్మశానవాటికకుబంపించెను. దేవేంద్రభవనమునకు నలుదెసలను వెలుపల తాళములును వాటిపైన ముద్రలనువేయించిదానిని ప్రభుత్వము స్వాధీనమున నుండజేసెను. అవురా! ఎంతమోసము! ఎంతమోసము! అని ప్రజలు పలువురు రొమ్ములు గొట్టుకొనసాగిరి. భాస్కరరావు స్వాస్థ్యమునొందిన వెంటనే కళ్యాణరావు భావికర్తవ్యమునుగుఱించి యాలోచనలు సేయుచుండెను.

---

# హంతకచూడామణి

## ఎనిమిదవప్రకరణము.

మఱునాటి యుదయమున బ్రచ్ఛన్న వేషములతో బయలుదేరి యిరువదిమంది దోపిడిగాండ్ర జట్టుతో శతమారి తన పాషికొండల గుహాసదనమునకు వచ్చెను. లోనబ్రవేశించి చెఱసాలల దొలుదొల్త బరీక్షించెను. అన్నియు జనశూన్యముగ నుండెను. భాస్కరరావు రక్షకభట ద్వయముతో దప్పికొని పోయినందుల కామెయంతగా చింతిల్లలేదుగాని, తాను ప్రేమించి స్వాధీనము చేసికొననెంచిన, రత్ననగరనివాసియగు విశ్వేశ్వరరావు, తప్పించుకొని పోయినందుల కెంతయు సంతాపము జెందెను. ఆరేయి నాభవనమున నెవ్వరును నుండరాదనియు, సాయంకాలము రెండుగడియల ప్రొద్దుపోవునరకు భవనమును శూన్యమందిరముగ జేసి యాహిరీ కొండలలోని గుహాగర్భమునకు బయనము గావలయునని యెల్లరకును శాసించెను. సూర్యాస్తమయ సమయమునకు ఇరువురు పరిచారికలచే పదునెనిమిదియేండ్ల వయస్సుగల యొక యువతీమణి దీసికొని రాబడెను. ఈ యువతిని జూచినప్పుడు ఆమెపోలికను బట్టి విశ్వేశ్వరరావు తలంపునకు వచ్చెను. ఆ కుసుమకోమలిని నిర్బంధించుట యనవసరమని భావించి శతమారి కార్యాలయమున నుండ నియమించెను. కార్యాలయమునగాని మఱెచ్చటగాని యొక్క యాయుధమేని లేకుండునట్లు అన్నిటిని బ్రోవు

జేయించి చోరుల స్వాధీనముచేసెను. తన పరివారమును మూడుభాగములు జేయించి, ఒకజట్టు ముందు నడచునట్లును, రెండవజట్టులో పురుషవేషమున దానుండదలచెను. మూడవ జట్టులో సాయుధులై వెనుకప్రక్కగను చూపు మాత్రపు దూరమున వెడలిరా నియమించెను. ఆరేయికిని మఱునాటికిని సరిపోదగిన తినుపదార్థములను ఆ యభినవభామిని కొసంగి ఆమెతో నిట్లు సంభాషించెను.

"అమ్మా! నీ వెచ్చట నుండుదానవు."

"నేను రత్నపుర నివాసినిని."

"నీ వీయరణ్యమున సంచరించుటకు గారణమేమి ?"

"మాయన్నయగు నొకయువకుడు వ్యాపారార్థము బయలుదేరివచ్చెను. చాలదినములైనది. అతనిజాడ గనుగొన నేరక మనుష్యసంచారముగల యన్నిపల్లెలను, గుట్టలను, నర ణ్యములను జేరి యతని నన్వేషించుచున్నాను. ఇచ్చట కనతి దూరముననున్న యరణ్యమధ్యముగబాట నేవచ్చుచున్నప్పుడు ఇరువురుపురుషులు నన్నిచ్చటికి బట్టుకొనివచ్చిరి."

"నీ వెట్లో ఇచ్చటికి జేరితివి. ఇది మహాకౄరులగు చోరులనిలయము. ఇచ్చటికి దేబడినవారెల్లరు నిర్బంధింపబడ వలయునని మాయధీశ్వరి యానతి. ఐనను రాగలకాలమున నీతోడ మాకు కాదగిన కార్యమున్నది. నిన్నితరులవలె నిర్బంధించి హింసించుటకు నేను బూనుకొనుటలేదు. నీవు నీదుస్తులను దీసివైచి నాయొసంగిన చీరను, రైకనుధరించి,

యథేచ్ఛగా నీగుహాగర్భమున విహరించుచుండుము. నేను కార్యాంతరమున బోవుచున్నారము. నాలుగు దినములలో తిరిగివచ్చు నభిప్రాయము నాకుగలదు. అప్పుడు నీనగరమునకు నిన్నంపెదను"

దుండగీండ్రెవ్వరేని నీకపకారము చేయవచ్చిరేని ఈ బాకుతో నీవాత్మసంరక్షణము చేసికొనుము. అని శతమారి యా యువతికి బాకునిడి నచ్చజెప్పెను. శతమారి పలుపలను ధరించి యాయువతి విధిప్రేరణమునకు దలయొగ్గక దప్పదని, ధైర్యముదెచ్చుకొని, శతమారి కార్యాలయమున ప్రొద్దు పుచ్చుచుండెను.

శతమారి గౌతమీతీరమునకు బోవు సారంగమును మూయించి భద్రముచేయించెను గుహాముఖద్వారమును సర్వ జనముతో వెలువడి యందు ముండ్లకంపలను ముండ్లచెట్లను, ఎండుమ్రాకులను, ద్రోయించెను. తుదనా గండురాతిచే నా ద్వారమును మూయించి శతమారి పైచెప్పినయట్లు పయనమై పోయెను.

గోదావరీతీరమునకు జేరినవెనుక నచ్చటి పల్లెవానిని బిల్చి, యొక యుత్తరమును వ్రాసి, ఓయీ, నీవీయుత్తరమును విలాసవతీనగరమున రక్షణశాఖాధికారి కందింపుము. మమ్ము వెంటనే నది దాటింపుము. అని యాతని కిరువది రూప్యముల నొసంగెను. పల్లెవాడు కొన్నిదినములవఱకు బాధ దప్పెనని సంతసించుచు, వారినెల్లరను నది దాటించెను. ఉత్తరమును దెలవారు వఱకు విలాసవతికి జేర్చెదనని వాగ్దానముచేసెను.

సూర్యోదయముగాకమునుందే, రెండుగడియలకు బూర్వముననే, దోపిడికాండ్రసంఘము ఆహిరీకొండలలోని యొక గూఢ గుహాంతరాళమునకు జేరుమార్గమునుబట్టిరి. శతమారి పల్లె వానిని బిల్చి, ఓయీ! నీవు నావెంటరావలయును. నీవు మఱలివచ్చువఱకు నీపడవను ఈ నా పరిచారిక జాగ్రత్తగా నడపుచు బాటసారులను నదిని దాటించుచుండునని దశమారిని జూపెను. దశమారిచెవిలో నేమియో రహస్యముజెప్పి, యామెను బడవపైకి బంపెను. పల్లెవాడు జట్టులోచేరి శతమారితో బయనము జేయుచుండెను. ఒక ఘల్లాంగు దూరమున దండుబాట వెంటబోవ రెండుబాటలు గలసినచోటు గానిపించెను. ఒకబాట పడమటిదెసగా మంచిరాల చూపున బోవునది. రెండవబాట ఆహిరీకొండల గుహాస్థావరమునకు బోవునది. రెండుబాటలు గలిసినతావున నించుక తడవు జట్టులన్నియు గుమిగూడి నిలచెను. శతమారి యప్పుడొక మేక పోతునుబట్టి తెప్పించి ఏబదిగజముల దూరమున నాహిరీ బాటలో గనబడుచున్నయొక్క దిరిసెన చెట్టుపైగట్టించి దాని మోరిల నింత పచ్చగడ్డి మేతగానుండునట్లుచేసెను. శతమారి యంత నడవి నడుమగా ముండ్ల దప్పుకొని చుట్టుతిరిగు, బాట గాని బాట, వెంటనడపించి యా దోపిడి జట్టును మాటు చెట్టున కావల నాలుగు ఘల్లాంగులదూరమున నాహిరీ పోవు దండుబాటకు జేర్పించెను. అట్లు శతమారి తను పోవుమార్గము నితరులకు దెలియనీయని చందమున బయనముసేసి చోరులతో నాహిరీ పర్వతగుహాగర్భమున బ్రవేశించెను.

---

# హంతకచూడామణి

## త్రొమ్మిదవ ప్రకరణము.

విలాసవతీ పరిశోధన కార్యాలయమున భాస్కరరావు కొలువుదీర్చియున్న సమయమున, తపాలామనుష్యుడు రెండు త్తరములు దెచ్చియిచ్చెను. సర్కారుబిళ్ళ లంటింపబడియున్న కాగితపు సంచిని మొదలుగ జించి భాస్కరరావు ఇట్లు చదువుకొన జొచ్చెను.

"విలాసవతీ రక్షణశాఖాధికారికి—పలుతావుల దోపిడి జరుగుచున్నట్లు ప్రజలనుండి విజ్ఞప్తిపత్రములు వచ్చుచున్నవి, కన్నపు దొంగలు విస్తరించినారు. రక్షణశాఖ యుద్యమము లేమియు తృప్తికరముగా లేవు. ఒక పెద్ద దొంగలజట్టు గోదావరీ ప్రాంతమున దిరుగుచున్నట్లు చాలమంది ప్రజలు అనుమానించుచున్నారు. ఇబ్బడి యుత్సాహముతో మీరు పనిచేయకున్నచో ప్రభుత్వమునకు చెడుపేరు వచ్చును."

"ప్రభుత్వ రక్షణశాఖ."
ధాన్యకటకము.

అప్పుడు అశ్వత్థరావుకాయు త్తరము జూపించి కర్తవ్యమేమని యడిగెను.

"తెగువచేసి మనము రాత్రి రెండవజామున చోరుల సావరములను ముట్టడింపవలయును. అవసరమైనచో రక్షక

భటుల యధికసంఖ్యకై యధికారులకు వ్రాసి తెప్పింపవల యును. ఇదియే కర్తవ్యము."

"మంచిది. మఱిపదిమంది రక్షకభటులు కావలయునని ప్రభుత్వమున కొక విజ్ఞప్తివ్రాయుము. చేవ్రాలు చేసెదను."

"అట్లే యొనర్చెదను. ఈరెండవ కాగితపుసంచిలో నేమున్నదో చూడుడు."

"అవునని భాస్కరరావు తనవ్రాతబల్లపై నున్న కాగితపుసంచిని విప్పి యందున్న యుత్తరము నిట్లు చదువ సాగెను.

అపరాధ పరిశోధన శాఖాధికారి,

భాస్కరరావుగారికి,

"నీవు నన్ను బట్టుకొనవలయునని, ప్రయత్నించు చున్నావు. నా పేరునుగూడ వినియేయున్నావు. కాని యీప్ర యత్నమున నీకు ప్రాణాపాయము గలదని తెలిసికొనజాల కున్నావు. ఒకపర్యాయము నీకు కేశఖండనము జరిగినది. దయ దలచి నిన్నంతటితో విడువగా తిరిగి నీవీదుస్తరకార్యమును సాధింపదలచి యున్నావు. రెండవసారి యొకయనుచరుని గోల్పోయి, ప్రాణములను రక్షించుకొంటివి. ఇంతచాలక నీవు మఱల నన్నే యవమానింప దలచినచో నీకు దగినశిక్ష కాగలదు. నీప్రాణములను రక్షించుకొనజాలని నీవు ప్రజల కొఱకు ఏమి రక్షణోపాయములు చేయగలవు? ఈపర్యాయము నీప్రాణములు దక్కవనుకొని నీప్రయత్నమునకు గడంగుము.

ఇట్లు.—"శత్రుఘాతుకురాలు."

ఈ యుత్తరములోని కడపంక్తులు చదివినకొలంది భాస్కరరావుకు మేనుపొంగినది. శౌర్యాగ్ని ప్రజ్వలించినది. కనుగొలుకు లెఱ్ఱవాఱినది. అశ్వత్థరావువంకజూచి "యీ యాడుకుక్కను పట్టజాలనియెడల మనము మగవాండ్రము గాము. ఇట్టి యధికారముగల మనము ఇంత సాహసముతోఁ బ్రవర్తించుచున్న యొక దొంగకూటి యాడుకుక్కను బట్టి బంధింపజాలనియెడల, ఈయధికారమునకు మన మర్హులము గాము. మనకు ధర్మాభిమానము లేదు. ఇట్టితలంపుల యపకీర్తిని మోసితిరుగుటకంటె మృత్యువునోట నేలప్రవేశింప గూడదు? ఏమందువు"

"అది పచ్చిమాంసముదిని ప్రేవుల మెడనువైచుకొని దిరుగు క్రూరాత్మురాలు. హంతకురాలు. ఎంతకైనను సాహసించును. స్వాభిమానత మనస్సునమునిగి శత్రువుచేతజిక్కుట చాల యసమర్థవిషయము. తగినయుపాయము బన్ని దీని కడ తేర్చెదము. పయనముసేయ సిద్ధపడుడు"

అట్లే మఱికొంతసేపు ఆలోచనలుసేసి పదిమంది రక్షక భటులను వెంటనుంచుకొని, తిన్నగా పాపికొండల పాతాళ సదనప్రాంతమునకు జేరిరి. అప్పటికి కనుజీకటి లోకమునావరించినది. గుహాద్వారము భాస్కరరావునకు బూర్వపరిచితమై యుండుటచే, వెంటగొంపోయిన గండ్రగొడ్డండ్రచే మూత రాయిని బగులగొట్ట భటుల కానతిచ్చెను. అయిదునిమిషములలో పెద్దరాయి తునాతునుకలయ్యెను. ద్వారముఖమున నుద్భవించిన ప్రఘాతనినాదముల నాలకించి కార్యాలయవర్తిని

యగు యువతి బాకుచేతఁబట్టి జాగరూకతతో నుండెను. బిలమార్గమునందలి కంటకాదులను దొలఁగించుకొని భాస్కర రావు రక్షకభటులతో లోనికిఁ బ్రవేశించెను. రెండుమారులు గాలిలో దుపాకులు గాల్పించెను. మార్గము నిరాతంకముగ నుండెను. గుహాగర్భము స్తబ్ధశూన్యముగ నుండెను. ధైర్య సాహస సంపన్నునకు మఱియొకసారి ఆశాభంగ మగునట్లు గనుపించెను. ఐనను అంతయుఁబరిశీలించి, శతమారి కార్యాలయమునకు జేరెను. బాకుచేతనిడుకొనిన వీరకుమారి భాస్కరాశ్వత్థరావులకు దృగ్గోచరమయ్యెను.

"అదిగో అక్కడనున్నదిరా?"

"దొరకినదిరా"

"ఇంకను చూతురేమిరా"

"దేవరా! కాల్చుటకు అనతియేనా!" ఈరీతిగ భటులు సంతోషముతో నాలపించిరి.

భాస్కరరావు. "ఆయువతిని గాల్చరాదు. దానిని బట్టుకొని, కావలసిన సమాచారము గ్రహించవలయును" అని ఆనతిచ్చెను. రక్షకభటులను, పరిశోధనాధికారిని చూచువఱకు, ఆకోమలాంగి బాకుక్రిందబారవైచి మూర్ఛగొని నేలపై వ్రాలెను. భాస్కరరావు ఆకోమలి ముంజేయి బట్టుకొనువఱకు ఆమె సువర్ణకంకణములు అశ్వత్థరావు కంటఁబడెను. సువర్ణమయకర కంకణములపై రత్నాపురం రత్నాంగియను నక్షరములు స్ఫుటముగ గనుపట్టెను.

భాస్కరరావు నానతిచొప్పున రక్షకభటుడొక్కడు చేరుమాలను నీటిలోదడిపి యామె మొగమున వైచెను. కొంతతడవున కా యబల అటునిటు మెదలి, లేచికూర్చుండెను. భాస్కరరావునకును నామెకును నిట్లు సంభాషణము జరిగెను.

"ఈ పాతాళభవనమునకు యజమానినివి నీవేనా?"

"నేనుకాదు"

"నీ వెవ్వరవు"

"నేను రత్నపురనివాసినినగు నొక యభాగ్యురాలను. ఇందలిచోరులు నన్ను ఈసమీపమున బట్టుకొని, యిచ్చటికి దీసికొనివచ్చి యిందు నిర్బంధించిరి."

"నీ పేరేమి?"

"నా పేరు రత్నాంగి"

"నీవు ఇచ్చటికి జేరువఱకీకారాగృలయమున మఱెవ్వరైన నుండిరా"

"భవనాధికారిణియగు శతమారి యిచ్చటనే యుండెను నన్ను దనవలువలను ధరింపజేసి, యిచ్చటికెవ్వరైన వచ్చినచో వారినీబాకుతో పొడువుమని చెప్పెను. భాస్కరరావు, క్రిందపడియున్న బాకునుదీసికొని దానిపై "శతమారి" అని వ్రాసియున్న యక్షరములను జదివి శిరఃకంపము సేసెను.

"తరువాత యేమిజరిగినది?"

"ఇచ్చట దొంగలజట్టును సంపూర్ణముగ వెంటబెట్టుకొని, ముఖద్వారము వెలుపలబడి, నన్నిందు బంధించి పోయి

నది. నాపూర్వపుణ్యవశమున మీరిచ్చటికి వచ్చితిరి. నన్నీ నిర్బంధావాసమునుండి బయటవైచుడు. అని చేతులు జోడించెను.

"తొలుత నీవీప్రాంతమునకు రా గారణమేమి?"

"మారత్నపురవాసియు మాయన్నయునగు విశ్వేశ్వర రావును వెదకుచు నందల్లాడుచుంటిని"

"ఏమీ! విశ్వేశ్వరరావు మీయన్నయా! అతడింకను నిల్లు చేరలేదా?"

"లేదు."

"అతడును నిందు నిర్బంధింపబడియుండ నతనిని విముక్తునిజేసి యింటికి బంపితిని. అతడిప్పటి కిల్లుచేరియుండును. ఈరక్షకభటుని నీకు సహాయముగ నిచ్చెదను. శీఘ్రముగ నీవిల్లు సేరుము. విశ్వేశ్వరరావుకు నాఅభివందనముల జెప్పుము. నేను బిలిపించినప్పుడాతడు విలాసవతిలో నన్నొకసారి కలియుమని చెప్పుము."

అని ధైర్యముచెప్పి, ఒకరక్షకభటుని దోడుగనొసంగి యామెను రత్నపురమునకు బంపెను.

పిమ్మట భాస్కరరాశ్వత్థరావులు చేయదగిన కార్య క్రమమునుగూర్చి యించుక తడవు చర్చించిరి. ఒకటి రెండు పర్యాయము లాభవన భాగముల నన్నింటిని బరీక్షించి యందెవ్వరును లేరని తెలిసికొని, భాస్కరరావు తన యనుచర సంఘముతో బిలద్వారము వెలుపలకు జేరెను. భాస్కరుని యుద్యమము నిష్ఫలమగుటచే గలిగిన విషాదమువలన నతని కోపాగ్ని తీవ్రరూపము ధరించియుండెను.

# హంతక ఘాతావణి

## పదియవ ప్రకరణము

రాజమహేంద్రవరమున నపరాధ పరిశోధన శాఖాధికారియగు కళ్యాణరావునకు చిరకాలమునుండి సంతతిలేకుండెను. కళ్యాణరావు గృహిణియగు సత్యవతి యిరుగు పొరుగు స్త్రీలలోను, బంధుమిత్రులలోను గొడ్డురాలను కారణమున నభిమానముచెంది న్యూనత పడుచుండెను. అందందు జేయు ప్రసంగములలో కొందఱు భద్రాచల క్షేత్రమునకుబోయి భద్రాద్రిరాముని సందర్శించి భక్తిచేత బూజించినచో సంతానము గాగలదని సత్యవతిని బ్రోత్సహించిరి. సత్యవతి బంధుమిత్రుల ప్రోత్సాహవాక్యముల విని విని, తనకు రాముని సందర్శింపవలయునని సంకల్పించుకొనెను. ఒకనాటి సంజకడ కళ్యాణరావుతో మనము భద్రాచలము పోవలయును. పుణ్యక్షేత్రసందర్శనమువలన పాపములు నశించును. కర్మపరిపక్వమైనచో వంశాభివృద్ధి కావచ్చునని హెచ్చరించెను. ఏఫలితమెట్లున్నను, రాముని సందర్శించుట ముఖ్యమైన కార్యమే గదాయనియు, కులాంగన యభిలషించిన మంచికోరిక తీర్చుటయు హృదయేశుని కర్తవ్యమనియు యోజించి, యందులకు సమ్మతించెను. మఱునాటి సాయంకాలము ప్రయాణము నిశ్చయించెను. రాజమహేంద్రవరమున నొక భృత్యుని వెంటగొని, దంపతులు పొగయోడ నెక్కిరి. రెండు దినములు

ప్రవాహమున కెదురుగ నోడ ప్రయాణము చేసెను. మూడవదినమునకు భద్రాద్రిక్షేత్రమునకు జేరిరి.

కళ్యాణరావును సత్యవతియు భృత్యునితో గ్రామ మధ్యమున నున్న యొక ధర్మశాలలో బసచేసిరి. కళ్యాణరావు కొలది దినములు మాత్రమే యుద్యోగమున సెలవు తీసికొని యుండుటచే శీఘ్రముగ దన యాత్ర పూర్తిచేయవలయునను కొనెను. శీఘ్రముగ దన యాత్ర పూర్తిచేయ వలయునను కొనెను. శ్రీరాముల దర్శనమునకై దేవాలయమునకుబోయిరి. సత్యవతి మనసార స్వామికిమ్రొక్కి తనకు సంతతి గావలయునని కోరుకొనెను. సాయంకాలము సమయమున దేవాలయమున జరుగు సద్గోష్ఠిలో పాల్గొనుటకు, సత్యవతి యేగి యాడువాండ్రలో గూరుచుండి, అప్పుడప్పుడచ్చటి స్త్రీజనముతో ప్రసంగము కలుపుకొనెను. కొందఱు స్త్రీలు సత్యవతి పరిచయము గలిగిన తరువాత నామెకు సంతానము కాలేదని తెలిసికొని యుపాయాంతరములుజెప్ప మొదలిడిరి. మఱి కొన్ని దినములచ్చట నుండవలయునని యామె యభిలషించెను. కల్యాణరావుకు సెలవులేకపోవుటచే నామెకు గావలసిన యేర్పాటులుచేసి, ఒక పరిచారిక నామె సేవకొఱకు నియమించి, భృత్యునిసైత మామెకడ నేవిడిచి తాను త్వరితముగ రాజమహేంద్రవరము చేరెను. ఎప్పటియట్లు కార్యాలయమునకు బోవ కొన్ని యుత్తరములు బల్లపై నుండెను. అందులో నొక యుత్తరమును గళ్యాణరా విట్లు చదువుకొనెను.

"నేటినుండి నాలుగుదినములలోగా నీ అపరాధ పరిశోధనాలయము దోయించబడును. నీఆయుధములన్నియు గోదావరిలో గలుపబడును. భాస్కరరావు ఇదివఱకే జీవములు గోల్పోయి యుండవచ్చును. ఒకవేళ ఒకగండము నుండి తప్పుకొనియున్నను మృత్యుదేవత అతని వెంటనే తిరుగుచున్నందువలన, ఏక్షణముననో అతనిని గబళించును. జాగరూకుడవై మెలంగుము.

ఇట్లు,
"శతమారి."

ఈ యుత్తరములోని యంశములు కళ్యాణరావు చిత్తమున కధికాంధోళన గలుగజేసినవి. తాను కార్యాలయము విడిచి యెందుబోవుటకును నవకాశము లేదని నిశ్చయించుకొని స్థానరక్షణ కొఱకు ఆలోచన సేయసాగెను. ఎట్లయినను భాస్కరరావును బిలిపించుకొనవలయునని విలాసవతికి రక్షకభటునిబంపెను. భాస్కరరావు కార్యాలయమున నగపడలేదు. రక్షకభటులీవార్తను కళ్యాణరావుకు వినిపించిరి. కళ్యాణరావు తన భటవర్గముతో కార్యాలయ రక్షణమును సేయుచు నిరువురను మాత్రము భాస్కరరావు నన్వేషించి యవసరమైనచో సాహాయ్యమొసంగి తీసికొనివచ్చుటకు నియోగించి యంపించెను.

శతమారి ఆదేశము ప్రకారముగా దశమారి గోదావరిపై పడవ నీవలావలికి నడపుచు పల్లెవాని రాకకై ఎదురు

చూచుచుండెను. తెలవారుజామున కోడికూయువేళను పదు నొకండుమంది ప్రయాణికులు గోదావరి దాటుటకై తీరమున జేరి పడవకొఱకు వెదకులాడుచుండిరి. పల్లెవానిపేరున పెద్ద కేకలు వేసిరి. ఈయులజడికి పడవపైనున్న యువతి నిద్ర మేల్కాంచి వారితో బ్రసంగించెను. చీకటిసమయమగుటచే నొకరినొకరు గుర్తించు నవకాశము లేకుండెను. మమ్ములను గోదావరి యావలియొడ్డునకు జేర్చవలయునని పాంథులడిగిరి. తెలవారువఱకు నిందుండ రాదా? పొద్దుపొడిచిన వెంటనే మిమ్ము నేఁటుదాటించెదనని యాయువతి పల్కెను. ఈసంఘములోని నాయకుడు "అట్లుకాదు మేము చాలతొందరపని మీఁదఁ బోవుచున్నాము. తెలవారువరకు మేము నాలుగు క్రోసులదూరము పోవలయును. గనుక మాప్రయాణమును భంగముసేయక యిప్పుడే దాటించుము" అని యొత్తిడిచేసి పల్కెను.

"మాకష్టమును విచారించి ప్రతిఫలమునిచ్చినచో అట్లే దాటించెదను"

"నీవు పవటిపూట దీసికొనుద్రవ్యమునకంటె రెండు రెట్లపైకము నధికముగా నిచ్చెదము."

"అట్లయిన పడవలో నెక్కుడు."

పదుదొకండుమంది ప్రయాణికులు పడవలో నెక్కిరి. పడవ పడతి నొకనులోనికిద్రోసినడుపుచుండెను. ప్రవాహము యతివేగముగా నుండుటచే, నావనడియేటికి వచ్చినప్పుడు, చీకటిపాటునఁ ద్రోవదప్పి, నీటిమట్టమునకు గొంచెము దిగువ

గానున్న, యొకగుట్టకు దఁగులొక్కనెను. పడవనడపు పడతి యొక్క సామర్థ్యమువలన తిరిగి త్రోవకు దెచ్చుచున్నట్లు ప్రయత్నించెనుగాని, తగిలినదెబ్బచే పడవయడుగున చిల్లుపడి లోనికి నీరురాజొచ్చెను. జనులెల్లరు పరమాత్ముని బ్రార్థింపజొచ్చిరి. ఐదునిమిషములు గడువకముందు పడవ నీటిమట్టమునకు మునిగెను. పడవపడతి తనచేతిలోని పెద్దతెడ్లనుదీసికొని ప్రవాహములో నుఱికెను. మిగిలినవారట్లు పడవలో కొంతదూరము కొట్టుకొనిబోయి, యచ్చటపడవ లోతునకు మునిగిపోవుటచే వారును బ్రవాహమునబడిరి. శతమారి, పడవపై దశమారిని నియోగించి యీప్రమాదము కావలెనని కల్పించెనని, చదువరులమనస్సులకు గోచరింపకమానదు. గోదావరి వఱదలుగాపొంగి వచ్చుచుండుటచే ననేకములగు వృక్షశాఖలును వృక్షములును గొట్టుకొనివచ్చుచుండెను. మనుజునకొక కొమ్మచొప్పున పదునొకండు మందియు చెట్లకొమ్మలగూరుచుండి, జీవములతో గొట్టుకొని పోవుచుండిరి. పడవపడంతుక చీకటిలో నెచ్చటికీదుకొనిపోయెనో యెవ్వరికిని గనఁబడలేదు. ఎవరిదేహప్రాణములకు వారేరక్షకులు గావలసివచ్చెను. కొంతదూరమున గోదావరి మెలికెతిరిగియుండెను. సూటిగబోయిన కొమ్మలు యొడ్డున దగులుకొనెను. అందఱును బ్రాణములతో నొడ్డున జేరుకొనిరి. ఆయుధములన్నియు గోదావరిపాలయ్యెను. కట్టుపుట్టములన్నియుదడిసి నీరుగ్రక్కుచుండెను. ఎదురుగాలికి చలి మిక్కుటముగా నుండెను.

ఆ తీరమున కనతిదూరమున నొక దివ్వెవెలుగు గానబడుటచే వారెల్లరు నాతడిబట్టలతో పడమటిదిక్కునకు నడచిరి.

కొలదికాలమున వారొక పల్లెవానిగుడిసెకు జేరిరి. అందొక పల్లెపడుచుదక్క మఱెవ్వరును లేరైరి. ఆమె వారికేవో పొడి బట్టలనిచ్చి పల్లెకటీరమునకుం బ్రక్కనుగల యొకపశుశాలలో గూర్చుండబెట్టెను. అంతలో దెల్లవారినది. సూర్యోదయ మయ్యెను. పల్లెపడుచుకు వారు తనపడవలోనెక్కి గోదావరీ మధ్యమునబడి, ఎట్లో ప్రాణముల దప్పించుకొన్నవారని గుర్తించెను. కాని లోగడచీకటిపాటున జూచియుండుటచే వారా యువతిని గుర్తింపలేదు. వీరికింకను బరమాత్ముడాయువొసంగి యున్నాడు. లేనిచో నీదురాపత్తును మీఱుటసాధ్యముగాదు. నాయుక్తి కార్యసాధకముగాలేదు. ఇంకను జూచెదనుగాక” అని తనమనంబున వితర్కముచేసికొని, వారితో తీయతీయగనే మాటాడజొచ్చెను. వారిని మఱియొకబారికి నగ్గముసేయు, విధానముగలదుగదాయని యూపడుచు సంతసించుచుండెను. వారితోనిట్లు ప్రసంగింపదొడంగెను.

"అమ్మాయీ! ఇంక మేము ప్రయాణముచేసెదము."

"రాత్రియెల్లనిదురలేక శ్రమపడియుంటిరి. కొంచెము ఫలహారముచేసి బయలుదేరుడు." అని మృదువుగను సగౌరవముగను మాటాడి, లోనికిబోయి ఒక మక్కకంకులబుట్టను దెచ్చి యొక్కకుంపటియు వారికడనుండెను. వారిలో కొందరా కంకులను గాల్చుచుండిరి. ముఖ్యులగువారు మెసవనారంభించిరి. అంతలోనామె రెండుభాండములనిండ బఱ్ఱెపాలను నింపుకొని వచ్చి వారిమోలనుంచెను. రెండుచిన్నిపాత్రలను సైతము దెచ్చి వారికొసంగెను. పదుగురుమాత్రమా కంకులుదిని,

పాలుద్రావి కొంతశ్రమదీర్చికొనిరి. సంఘములోనిముఖ్యుడు మనస్థైమిత్యములేక, తనకుగలుగునాపత్తులను దలంచి విచారించుచు నాకు దినవచ్చలేదని యేవోముచ్చటలు జెప్పుచు గూరుచుండెను. పల్లెపడుచు పాలను దెచ్చియిచ్చినవెంటనే త్రావుచుండుడు యిదేవచ్చుచున్నానని నమ్మజెప్పి యొక వెదురుపొదలోనికి జాటి యల్లనల్లన దూరముగబోయెను. కొంతసేపటికివారు ఆమెకొరకు దేరిపారజూడ నామె కను చూపుమేరలో నెచ్చటను గానరాలేదు.

కొంతసేపటికి ప్రయాణముచేయవలయునని యుద్యమించి లేచుచు నొక్కొక్కడు తలతిరిగి నేలవ్రాలుచుండెను. పదిమందియు నొడలు తెలియక పడిపోయిరి. వారిలో ప్రముఖుడొక్కడు మాత్ర మాపదార్థము లేమియు ముట్టని వాడగుటచే తెలివితోనుండి యిదియంతయు నీపల్లెపడుచు చేసిన మోసమని గ్రహించెను. అతడు తన సహాచరులను బ్రదికింపగల యుపాయములన్నియు జేసెను. కాని వారి కాయువు అప్పటికి సరిపోయినది. పశుశాలలోనున్న గడ్డ పలుగును పారను దీసికొని వానిలో నాశవములను బెట్టి పూడ్చివైచెను. ఈనిర్జన స్థానమున నిక నుండరాదని యా సమీపమున నుత్తర దిశగా నగుపడుచున్న దండు బాటకు జేరెను.

ఆ దండుబాటవెంట సూటిగా దక్షిణదిశకు బ్రయాణము చేయుచో తిరిగి గోదావరీతీరమునకును, ఈశాన్యదిశకు బోయినచో నాహిరీ కొండల యొద్దకిని బోవును. ప్రస్తుతము

మన సంఘప్రముఖుడున్న తావు మేకపోతు గట్టింపబడిన దిరిసెనచెట్టునుండి నాలుగు ఫర్లాంగుల దూరమున మాత్రమున్నది. ఒంటరియై విషాదావృతచిత్తుడైన వీరకుమారు డిప్పుడా దిరిశెనచెట్టును డాయుచున్నాడు. గతదినమెల్ల నొక బెబ్బులి, యామేకపోతు చెట్టుపై నుండుటజూచి, యాచెట్టుపై నెక్కచేతగాక గాండ్రపెట్టుచు చెట్టుచుట్టును దిరుగుచుండెను. అర్చియార్చి, ఫలితార్థములేక, యాకలిబాధచే డస్సి, యాయాసమున గృశించి, మేకపోతుపై దృష్టినివీడక, దిరిశెన చెట్టునకును దండుబాటకును నించుక దూరమున నున్న యొక పొదలో బండియుండెను.

మన వీరప్రముఖుడా బాటవెంట చెట్టుదరకి వచ్చెడు సమయమున నాబెబ్బులి గాడ్రింపు వానికి వినవచ్చెను. అది పెద్దపులి ధ్వనియని గుర్తించి జరజర నా దిరిశెనచెట్టుపై కెగబ్రాకెను. మన వీరు డిప్పుడు ప్రాణసంకటమునబడి బయలుపడు నుపాయముల నూహించుచున్నాడు. గుండె గుటగుటలాడుచున్నది. మేకపోతు స్మరణకువచ్చినప్పుడు పెద్దపులి కన్నులు విచ్చి చూచినంతనే దాని చెంత నొక మనుష్యుడు గనబడనయ్యెను. ఇరువురను గబళింపవచ్చునను నాశ, శార్దూలమునకు బొడమెను. రాజఠీవితో లేచి పొదలోనుండి బయటికివచ్చి యొకచెసారి యడవి మాఱుమ్రోవ గాండ్రింపు వెట్టి యాచెట్టుచుట్టును దిరుగ మొదలిడెను. ముంగాళ్ళు మ్రాకుపై నిడి యప్పుడప్పుడు గీఱ మొదలిడెను. అక్కటా యిట్టి పరిస్థితియందు ధైర్యమవలంబించుటకు నెట్టిధైర్యశాలి గావలయును ? ఇట్టిఘోరవిపత్తునుండి దప్పించుకొనుటకు

మన వీరాగ్రేసరుడగు భాస్కరుడుగాక మఱియెవ్వడు సమర్థుడు? భాస్కరరావు "మర్త్యునకు మృత్యువు సహజము. మృత్యువు మానవు నొక్కమారే యెదుర్కొనును గాని రెండవమారు వానిని మృత్యువేమియుఁ జేయజాలదు." అని యాలోచించి యా బెబ్బులివంకను, బెబ్బులియార్పులకు భీతిల్లి జీవితాశనువదలుకొని వడకుచున్న మేకపోతును నొక్కసారి కన్నారవీక్షించి తన తరణోపాయము నూహించుకొనెను. మేకపోతు కట్టువిప్పి, బలమార నొక్కమారు మేకపోతును నేలపై దూరముగ పారవేసెను. అది దిరిశెన చెట్టునుండి, పదిరెండు గజముల దూరమునబడెను. శార్దూలము తటాలున మేక పోతుపై కుఱికి దానిని తన పంజాతో గొట్టి నీల్గించెను. పెద్దయాకలిగొనియున్న బెబ్బులి దృష్టి మేకపైననేగాని వేఱు పదార్థమున లేదయ్యెను. భాస్కరరావు దిరిశెనచెట్టుకొమ్మనుండి మఱియొక చెట్టుకొమ్మకు బోయి, అల్లనల్లన దూరగుడయ్యెను. ఇంచుకదూరమునకు బోవుట సాధ్యమయిన వెంటనే క్రిందికిదిగి, ఆవలావలికి బోయి కాలిబాటల వెంట నతి శీఘ్రముగ గౌతమీతటమునకు జేరెను. అచ్చట సిద్ధముగ జేపలుపట్టుచున్న నొక్క పల్లెవాని నావపై నెక్కి వానికింత ద్రవ్యము నొసంగ నాసపెట్టి గోదావరిఁ జేరి యావలి దరికిజేరెను. అచ్చట నిలువక తీవ్రవేగమున బోవుచు విలాసవతీ నగరమునకు జేరెను.



# హంతకచూడామణి

## పదునొకండవ ప్రకరణము.



ఆ హిరీకొండలలోయలలో స్థావరము నేర్పఱచుకొనిన శతమారి మనశ్శాంతితో నుండలేదు. భద్రాచలమున వైద్య ప్రచారము చేయుచు ప్రజోపకారిణియై యోగినీవేషముననున్న మారిణియొక్క దినకృత్యములన్నియుఁ దెలిసికొనుచునేయున్నది. భాస్కరరావును దుదముట్టించుటకు దానుపన్నిన రెండుపన్నాగములను వెంటనేమారిణికి దెలియజేసియే యున్నది. రెండు దినములయినతరువాత, దశమారి పదిమంది భాస్కరభృత్యులను జంపి భాస్కరరావు తనబారినుండియు; పెద్దపులిబారినుండియు గూడ తప్పించుకొని పోయెనని విచారించి, యావార్త శతమారికి దొలుదొల్త దెలియజేయవలయునని, యాహిరీస్థావరమునకు బయనమైపోయెను. రెండుపర్యాయములు భాస్కరరావు తప్పించుకొని పాఱిపోయి, సజీవుఁడై యున్నసంగతి శతమారి కెఱింగించెను. మారిణియొద్దనుండి, కళ్యాణరావు భార్యయగు సత్యవతి యచ్చటనివసించి యున్నదనువార్త శతమారియొద్దకు జేరియున్నది. ఈపరిస్థితుల పరిజ్ఞానమట్లుండగా, శతమారి యికముందు అధికభయంకరములగు రంగములలోదాను సంచరింపవలసియుండునని నిశ్చయించుకొని తనభృత్యవర్గమును వృద్ధిచేసెను. అహిరీప్రాంతమున వసించు కొండజాతి కోయలలో ననేకులను తనదోపిడిగాండ్ర జట్టులో జేర్చెను.

ఇప్పటికి నామెయొద్ద పదిజట్టులు ప్రోవై యుండెను. జట్టుజట్టు నకును బదిమందికన్న దక్కువ లేకుండిరి. ఆహిరీకొండలోయలో నైత మొక సహజసంగతమగు పాతాళభవనమునే స్థావరముగ నేర్పఱచుకొనెను. పర్వతోపరి ప్రదేశమున నొక చిన్న రాతిగూటి నాధారముచేసికొని యొకకోయ కుటుంబమునందు నివసింపజేసి, వానియొద్ద నొక దూరదర్శనయంత్రమునుంచెను. ఎప్పటికప్పుడు నాలుగుమైళ్ళ దూరము వఱకును జుట్టుప్రాంతము నవలోకించి శత్రువులరాక తన కెఱింగించుచుండవలయునని యాకుటుంబ యజమానికాదేశించెను. అతనికి మున్నున్న పేరుమార్చి దూరదర్శియను నామమునుంచెను.

తనయొద్దనున్న పదిజట్టుల దోపిడి కాండ్రకును విఘ్న విద్యలు నేర్పెను. కొందఱికి గంగిరెద్దు నాడించు వేషము నేర్పెను. కొందఱికి జంగము వేషముతో భిక్షాటనము నేర్పెను. కొందఱకు హస్తలాఘవము నేర్పెను. కొందఱికి దొమ్మరవాండ్రయాట నేర్పించెను. కొందఱికి బుడబుక్కవాండ్ర నడవడి నేర్పించెను. కొందఱు పరిచారికలకు సోది జెప్పుట నేర్పించెను. ఒక జట్టువాండ్రకు, కోతులనాడింపను నేర్పెను. మఱియొక జట్టునకు ఎలుగుబంటునుబట్టి దానిచే నాటలాడించురీతి నేర్పించెను. కొందఱికి కోడిపందెములు వేయించుట, పైపందెములు వేయుట మున్నగు నడతలు నేర్పించెను. కొందఱికి గొఱ్ఱెపోతులచే నొండొంటిని దాకు వైఖరి నేర్పించెను. గొఱ్ఱెపోతు శీర్షమున గొట్టవచ్చినప్పుడు దానిని చేతులతోను చెక్కలతోను నెదిరిపట్టుకొను నైపుణ్యము నేర్పించెను. ఇంకను మిగిలినవారికి బగటివేషములతో

ప్రజలను నొప్పింపగల మార్గములు వివిధములుగ నేర్పించి యుంచెను. ఈజట్టుల వారెల్లరును, పట్టుపగలు తమతమ నైపుణ్యములు ప్రజలకు జూపి యడుగుకొనుచుందురు. రాత్రి వేళ జట్లుగా బయలుదేరి పల్లెలలోను బట్టణములలోను దోపిడులుచేసి ధనార్జనము చేయుచుందురు.

శతమారి యీవిధమున నేర్పాటులుచేయించి యనల్పమయిన బలమునొంది, యప్పటి కర్తవ్యమును గూర్చి దశమారితో ముచ్చటించెను. ప్రసంగవశమున దశమారి కేమియో రహస్యముగఁ జెవిలోఁ జెప్పెను. దశమారి యానాటి వేసముమార్చికొని నియమిత స్థానమునకు బోవ బయలుదేరెను.

భద్రాచల క్షేత్రమునందలి నూతన యోగిని కీర్తి యంతకంత కధికమయ్యెను. పలుతావులనుండి కార్యార్థులు వచ్చి తమకార్యములనెఱవేర్చుకొని పోవుచుండిరి. పని సమర్థించుకొనుట యామె యొక్క తేవలన సాధ్యముగాకుండుటచే ననేకులగు శిష్యయోగినులను జేర్చుకొనుచుండెను. ఇప్పుడు నూతనముగ మఱియొక యోగినీ వేషధారిణి యామెకు ముఖ్యశిష్యురాలయ్యెను.

సత్యవతికిని అభినవ శిష్యయోగినికిని నిట్లు ప్రసంగము జరిగెను.

"తల్లీ! నీవు ఈక్షేత్రమున ప్రసిద్ధికెక్కిన యోగినిం జూచితివా?"

"చూచితిని. కాని యామెను సేవించవలయునను నా కోరిక దీర లేదు."

"అదియొక గొప్పసంగతియా ? నీవు నావెంట వచ్చెదవేని, నీకామె దర్శనము చేయించెదను."

"అంతకంటె నాకు గావలసినదేమున్నది? పరిచయములేక, నాకై నేనే యామెను సందర్శింప బోయినచో నాపెనాకు దర్శనావకాశ మొసంగునో, కాదనునోయని సంశయించి, సమయమునకై వేచియున్నాను. సంతానహీనసై బంధుమిత్రులలో చాల చిన్నతనము ననుభవించుచుంటిని. ఆమెవలన నెట్టిగొడ్డుమోతులైనను బిడ్డల గనుచున్నారని వదంతులు గలవు. నీవు నావెంటవచ్చి, యామె పరిచయము గలుగఁజేసితివేని, నేను నీకు శాశ్వత కృతజ్ఞురాలను.

"ఇది యొక ఘనకార్యమా బయలుదేరుడు"

ఇట్లు సంభాషణముజరిగినపిమ్మట, వారిరువురును గురుయోగినియొద్దకు బోయిరి. శిష్యయోగిని, గురుయోగినిని దొలుతగా డాసి, కనుసంజ్ఞచేసెను. గురుయోగిని ఆమెనిచ్చటికి దోడ్కొనిరమ్మని చెప్పుమనిశిష్యురాలి కాజ్ఞనొసంగెను. సత్యవతి గురుయోగినిని సమీపించి సాష్టాంగనమస్కారము గావించెను. కొలదికాలమున నీకష్టములు దీరఁగలవని యామె యాశీర్వదించెను.

గురుయోగిని సత్యవతితో నిట్లుసంభాషించెను.

"సతీరత్నమా! నీవృత్తాంతమంతయు నేను దివ్యదృష్టిచే గనుగొనియున్నాను. నీవుసంతానాభిలాషిణివై నాయొద్దకువచ్చి యున్నావు. నీకొక దేవమందిరము చూపించెదను. నీవు తత్ గర్భమున గూరుచుండి భగవద్ధ్యానము చేయవలయును" ఒక్కజామువఱకు నీవు తపస్సుచేసిన యినంతరమున నేను నీకడకువచ్చి రెండువిధములగు చూర్ణములనిచ్చెదను. అందొక దానిని నీవుదినవలయును. రెండవచూర్ణమును నీభర్తకొసంగుము. అతడును దానిని దినవలయును. ఈచూర్ణములను బాలలోగలిపి యాపాలుద్రావినను ద్రావవచ్చును. ఒక్క మాసముననే కార్యసిద్ధి లక్షణములు గనబడగలవు."

"ఇంతకంటె కావలసినదేమున్నది! అట్లే యొనర్చెదను."

"ఈ నాశిష్యయోగిని నీకు స్థానముచూపించి నీకు గావలసినదెల్ల యొసంగును. ఈమెతో నరుగుదెంచుము."

ఇట్లు సంగ్రహముగా ప్రసంగించి, యోగిని రామనామోచ్చారణముసేసి, తనయాసమున గూరుచుండెను. శిష్యయోగిని సత్యవతిని వెంటబెట్టుకొని యాగుహాంతరాళమునకు లోభాగములోనున్న యొక రహస్యస్థానమునకు గొంపోయి, యొక దర్భాసనమునొసంగి యందు గూర్చుండఁబెట్టెను.

కొంత తడవైనతరువాత శిష్యయోగిని సత్యవతియొద్దకు బోయి యిదిగో తల్లీ! పాలుదెచ్చినాను. యోగినిచే నీకొసంగబడిన చూర్ణమును పాలలోగలిపి పుచ్చుకొనుమని చెచ్చ

రించెను. సత్యవతి తనయొద్దనుంచుకొనిన చూర్ణమును బాలలో గలిపి త్రావెను. వెంటనే యామె మైమఱచి నేలపై బడెను. యోగినియు శిష్యురాలును నిరువురును మత్తునబడియున్న సత్యవతిని బయట సిద్ధముచేయబడియున్న మేనాలో పరుండ బెట్టిరి. శిష్యురాలి యాదేశముప్రకారము, మేనాబోయీలు నిశ్శబ్దముగా బ్రయాణముచేయుచు రేయినడిజాము వేళకు, ఆహిరీ రహస్యస్థావరమునకు నామెనుజేర్చి శతమారి కప్ప గించిరి. అప్పటికిని నామెకు మెలకువరాలేదు. శతమారి సత్య వతి యుదంతమును బోయీలవలన దెలిసికొని, యాలసింపక నొకచీకటిగదిలో నిర్బంధించెను. సత్యవతి కొంతవడికి మూర్ఛ దేరి మత్తువదలినపిమ్మట చుట్టుప్రక్కల నరసిచూచి, తన నిర్బంధావాస పరిస్థితియు గ్రహించి, మోసముజరిగెనని తెలిసి కొని, విముక్తికాలము రాగలదాయని చెఱసాలలో పరితపించు చుండెను.

ఆనాటిసాయంకాలమువఱకు నెదురుచూచి సత్యవతి భృత్యులు తమ యజమానురాలికొఱకు గ్రామమంతయు వెదకులాడిరి. ఇంటింటికిబోయి మాయజమానురాలు వచ్చెనా యని యడిగిరి. కట్టకడకు యోగినియొద్దకుబోయి మాయజ మానిని సత్యవతమ్మ మీయొద్దకు వచ్చెనాయని యడిగిరి. ఎవ్వరో యొకయిల్లాలు మాదగ్గిరకువచ్చి తనకేమో మందు గావలయునని వేడెను. నీకు మందొసంగెదను. రెండుగంటల కాలము సైపవలయునని పల్కితిని. అందులకామె సమ్మ తింపక "నేను రాజమహేంద్రవరము పోవలయును. నేనంత దనుక నిందుండజాలనని వెడలిపోయినది. శతవిధముల ఆమె

వెంటనే సిద్ధముగనున్న పొగయోడలోనెక్కి, రాజమహేంద్రి వరమునకు బ్రయాణముచేసెను.

ఇప్పుడామె రాజమహేంద్రివరమునకు జేరియుండ వచ్చునని నావిశ్వాసము. మీరు తొలుదొలుత రాజమహేంద్ర వరమునకుబోయి యామె యింటికిజేరుకొనినదేమో కనుగొనుడు. అని వారికిసమాధానము చెప్పెను. భృత్యులామె మాటలపై విశ్వాసముంచి, తొందరపాటున మనకుదెలియకుండగనే సత్యవతీదేవి, రాజమహేంద్రివరమునకు వెడలిపోయి యుండవచ్చునని, వారిలోవారు నిశ్చయించుకొనిరి. వెంటనే సత్యవతిభృత్యులు బయనమైపోయి, రాజమహేంద్రివరము జేరిరి.

కళ్యాణరావు తనగృహిణితెల్పిన దినమునకు ఇల్లు జేరకుండుటచే నాతృతతో నెదురుచూచుచుండిరి. అంతలో భద్రాచలమున సత్యవతితోనుండ నియమించబడిన పరిచారకుడును, పరిచారికయు నరుగుదెంచి సత్యవతి యదృశ్యతను గురించి తెల్పిరి. ఒకయోగినితో సంభాషించుటకును ఔషధము తెచ్చుటకును ఒంటరిగాబోయినవిషయము మాత్రమాతని కెఱింగించిరి. కళ్యాణరావు ఇంచుకయాలోచించి ఏదో మోసముజరిగినదని పరిపరివిధముల నాలోచించి తుదకు భాస్కరరావుకు వెంటనేరావలయునని వార్తనంపెను.

జరిగిన వృత్తాంతమును గురించి యుభయులును కొండొక తడవు చర్చించుకొని, సత్యవతినన్వేషించుటకు భద్రాచలమునకు వచ్చిరి. సత్యవతిజాడ లెచ్చటను దొరుకలేదు

సర్వసాధారణముగా స్త్రీలకు నౌషధము లిచ్చుచున్న దను ననుమానముతో యోగిని స్థానమునకు బోయిచూచిరి. అచ్చట యోగిని గాని యామెకు సంబంధించిన యితరులు గాని యెవ్వరును లేకుండిరి. సత్యవతి యేమయ్యెనో యోగిని మొదలగువా రెందుబోయిరో ఎవ్వరినడిగినను జెప్పజాలరైరి.

ఈ ఘోరకృత్యమును వినిన భాస్కరరావు భావమునం గ్రోధాగ్ని యత్యుగ్రమయ్యెను. కళ్యాణరావు చిత్తమున విషాద క్రోధములు పెనగొని క్షణక్షణమున బాధించుచుం డెను. శతమారి మోసకృత్యమును ఘాతుక కృత్యమును నంతమొందింప జాలనందులకు, నిరువురును నవమానము పడినవారివలె చింతాక్రాంతులై యుండిరి. ఆలోచనచేయుచు విషణ్ణ హృదయులైన వారిరువురును నిట్లు సంభాషించుకొన మొదలిడిరి,

"భాస్కరరాయా! శతమారిని బట్టుకొనుటకు నుపాయ మేమియులేదా ?"

"ఆమెయున్న జాడ తెలిసినతరువాతం బట్టుకొను నుపాయము చేయవలయును."

"ఈ నాడొక చోటనున్నట్లు గుర్తులుచూపి మఱి యొక చోట దాగియుండును. ఇట్టి వంచకురాలిని బట్టుకొనుట యెట్లు ? ఉన్నచోటు తెలిసికొనుటయెట్లు ?"

"మంచిది. నేనొక యుపాయముచేసి యామె జాడ తెలిసికొనియెదను."

"ఏమియుపాయము ?"

"సత్యవతీదేవి నామెయేమోసగించి యుండును. ఈమె జాడ మనమెట్లయినను గనుగొనవలసియేయున్నది. కావున, సత్యవతీదేవిని రక్షించుకొనిన తరువాత నామెను సాధింప వలయును గాని ఈలోపల మనమేమి దండగము చూపినను, సత్యవతీదేవి చిక్కుబడియుండుటచే, నామె ప్రాణములకు హానిరావచ్చును. కావున మృదుమార్గమున సత్యవతీదేవి జాడ తెలిసికొని, మఱియొక సాధూపాయముచే నామెను దిరిగి పిలిపించుకొనవలయును. తరువాత శతమూరిసబట్టి నామ రూపములు లేని చందమునఁ చేయవలయును."

"నిజము, నీవుచెప్పినమాట సత్యమేగాని, సౌమ్య మార్గమున, నామెను నిర్బంధమునుండి వెలువరించు నుపాయము సెప్పుము."

"ఈనాఁడు నే నెట్లేని సత్యవతీదేవి, ఈ యూరినుండి యెట్లు బయల్పడెనో తెలిసికొనియెదను. తమరు స్వస్థచిత్తులై యుండుడు." సంభాషణ ముగిసినవెనుక అపరాధపరిశోధకులు బాటసారుల సత్రములోనికి బోయిరి. భాస్కరరావు తన యధికారి కేమో రహస్యముసెప్పి, తానూరిలోనికి వెడలెను.

# హంతకచూడామణి

## పండ్రెండవ ప్రకరణము

భాస్కరరావు భద్రాచలమున కళ్యాణరావుచే నొక ప్రకటన చేయించెను. ఆ ప్రకటనను గ్రామమునసబు గ్రామమునం దన్ని వీధులయందును నందఱికిని దెలియునట్టుల డప్పు వేయుచు జాటించుటకు గ్రామపు వెట్టివానిని నియమించెను. వెట్టివాడు "ఒక అమ్మాయిరు తప్పిపోయింది. ఆమెజాడ చెప్పే వారికి వెయ్యిరూపాయలు బహుమానం దొరుకుతుందో హాోయ్" అని కేకవేయుచు డప్పుకొట్టి చాటించినాడు. ఎల్లరకును నీవిషయము విశదమయినదికాని తప్పిపోయినవ్యక్తి అపరాధ పరిశోధన శాఖాధికారి భార్యయని యెవ్వరికిని దెలియదు.

సాయంసమయమున నొక కల్లు అంగడియొద్ద పలుమంది త్రాగుబోతువాండ్రు చేరిరి. భాస్కరరావు మాసిన గుడ్డలు కట్టుకొని త్రాగుబోతువాని వేషము ధరించి తానును గల్లంగడికిబోయెను. తోక వ్రేలాడగట్టిన రొుక తలగుడ్డనె త్తికి జుట్టుకొని, ఒక ముంత చేతబుచ్చుకొని కూరుచుండెను. అక్కడకు చేరిన కొందఱు త్రాగుబోతు లీవిధమున బ్రసంగింపసాగిరి.

"ఈ ఊళ్ళో సంగతులు ఇన్నావంటా?"

"ఏం సంగతిరోయ్"

"ఎవరో ఒకఆడదాని తప్పేశారంట. ఆయమ్మజాడ చెప్పేవాడికి వెయ్యిరూపాయిలు యిత్తారంట"

ఆ తాగుబోతులలో నొకచాకలివాడు ముందుకుజరిగి "నేనుచెప్పుతాను. నిజంగా వెయ్యిరూపాయిలు ఎవడిస్తాడురా?

"ఇయ్యాల డప్పుచాటించారురా"

"అయితే ఎవడిస్తాడంటావురా"

అప్పుడుభాస్కరరావు తనప్రసంగమునకు సమయము వచ్చినదని తెలిసికొని "ఎవడెందుకిస్తాడోయ్ ? ఆయమ్మ గావాలంటే ఆయమ్మమగడే యిస్తాడు"

"నిజంగాఇస్తాడా?"

"తప్పకయియ్యగలడు. నీకేమైన ఆయమ్మనుగుఱించి తెలిసినచో చెప్పుము. ఆమెమగడు ఇయ్యనియెడల నేనె యియ్యగలను.

"శెబాష్. బాగామాట్లాడావు. ఇఁక నేను చెప్పుతాను. ఇను."

"మాబోయీలుముగ్గురు నేనుగలసి, ఒకమేనా మోసికొని పోయాం. అందులో ఒకఅమ్మోరు మాట్లాడింది."

భా "మీరామేనాను ఏఊరికిమోసికొని పోయినారు"

"ఆహిరీమూల కొండలలో దిగబెట్టివాచ్చాం"

భా "ఆయమ్మనునీవు గుర్తించిగలవా?"

"ఒకమాటు చీకట్లోచూస్తే ఎంగుర్తయ్యా? మాట్లాడితే గుర్తుపట్టుతాను."

భా "సరే నీవునాతోరమ్మా. ఆ ప్రాంతమునకే పోదాము. ఆమెదొరికినదా, వెయ్యిరూపాయిలు నేను నీకిచ్చివేసెదను."

"జాడచెప్పితేనే ఇస్తానంటివే?"

"మఱి నీవుచెప్పినజాడ నిజముకావలదా?"

"సరే, నేను నీకుదోవచూపిస్తాను. ఆదోవవెంటవెళ్ళు. ఆకొండలలో ఎక్కడనోఉంటుంది. అదంతాఎతికితే ఎక్కడనో ఒకచోట కనుపిస్తుంది."

ఈసమాచారము భాస్కరరావు మనస్సునకువచ్చినది. శతమారి ఏదోఉపాయముచేసి సత్యవతినిగొంపోయి యేదో ఒకరహస్యస్థానమున బంధించినదని యతడు తెలిసికొనినాడు. సరియే "నేను నీవుచెప్పిన ప్రదేశమునకుబోయి యామెజాడ కొఱకు ప్రయత్నించెదను. ఆప్రకారము ఆమె మాకులభించిన యెడల నీబహుమానము నీకుతప్పకయిచ్చెదను" అని భాస్కరరావు బోయికి వాగ్దానముచేసి వానినిదృప్తిపఱిచి పంపివేసెను.

భాస్కరరావు ఇంచుక ధైర్యముతోడను నుత్సాహముతోడను, గళ్యాణరావు నొద్దకువచ్చి, భావికర్తవ్యమును గుఱించి యాలోచింపసాగెను. నాలుగు దినములలో నొక ఆంధ్రమహిళాసభ "సిరివంచ" యను గ్రామమున జరుగగలదనియు, స్త్రీలందఱును దమతమ విద్యానైపుణ్యములను బ్రదర్శించుటకును, ఆమామహిళ లభ్యసించిన కళాజాలముపై ప్రతిమహిళయు నుపన్యసించుట కవకాశ మొసంగబడుననియు

పెద్దప్రకటన జేయు నేర్పాటులు సేసిరి. పెద్ద యక్షరము లతో బ్రకటనలు వ్రాయబడిన కాగితములు ప్రముఖస్థానములలో నంటించబడెను. కరపత్రములు వేనవేలుగ నచ్చొత్తింపబడి, అన్నిగ్రామములందును బత్తనములయందును బంచబడుటకు నేర్పాటులు సేయబడెను. సిరివంచనలో నది యొడ్డున నొక పెద్ద తాత్కాలిక సభాభవనము నిర్మాణము సేయబడెను. కుర్చీలు బల్లలు రత్నకంబళములు విరివిగా నమర్చబడెను. పురుషులుగూడ ప్రత్యేక స్థానములయందు గూర్చుండి యుపన్యాసములు వినుట కవకాశము కలుగ జేయబడెను. కొలది దినములకు ముందే ప్రకటనలు గావింపబడి యుండుటచే నొక పెద్ద సంతబజారు సయితము సాగవచ్చునని వివిధ ప్రాంతములనుండి, వర్తకులు వేనవేలు నాణెముల నెలసేయు సరకులను దీసికొనివచ్చి యంగడుల నేర్పఱచుకొనిరి.

ఆహిరీ ప్రాంతమునందు నుండియు నొక స్త్రీ సమూహము వచ్చెను. వివిధప్రదేశములనుండి యనేకులు స్త్రీలు విచ్చేసిరి. ఒక ముఖ్యస్థానమున నొక మహిళాసంఘము వ్యాపారము చేయు వ్యాజముతో వచ్చెను. వారొక పర్ణశాల వేయించి దానినిండార రంగురంగుల పానీయము లమర్చియుంచిరి. షోడా, మధుపానీయము, యింకను వివిధములైన పానీయ రసములను కాచ పాత్రములయందుంచి యంగడి సాగించిరి. ఆపర్ణశాలలో లోదట్టున నొక యఱ నేర్పఱచిరి. అంగడి ముందొక పందిలి వేయించుచు దానిని కప్పీలు త్రాళ్లు మొదలగు వానితో క్రిందికి మీదికి చలించు లాగున

నేర్పాటుచేయించిరి. పందిలిని నేలబారుగ వదలుటకును పండ్రెండడుగుల ఎత్తువరకు పైకి లేవనెత్తుటకును నేర్పఱచిన త్రాడు పెద్దమోకు ఒక కప్పీమీదుగ పర్ణశాలలో నేల గది లోని కమర్చబడిన యొక గొట్టములోనుండి వ్యాపింపజేయ బడి నేలగదిలో పాతబడియున్న యొక యినుప గునపమునకు గట్టబడియుండెను. గునపమునకు గట్టబడిన త్రాడుముడివదల బడినచో పందిలి తటాలున నేలకు వచ్చునట్లు ఏర్పాటుచేయ బడి యుండెను.

సభాదినమునకు బూర్వదినమున మధ్యాహ్నము భాస్కరరావును, కల్యాణరావును కాఫీగిన్నెలు ముందుపెట్టు నోని పానీయము త్రావు సమయమునందు తపాలావాడు భాస్కరరావు పేర వ్రాయబడిన యొక యుత్తరమునుదెచ్చి యిచ్చెను. భాస్కరరావు దానిని జింపి యిట్లు చదువుకొనెను.

"భాస్కరరాయా ? నీవు చేయించబోవు మహిళా సమావేశముయొక్క అభిప్రాయము నాకు దెలియును. ఒక సమావేశమున బాల్గొనజేసి, ఏదో ఒక నెపమున నన్ను బట్టు కొనుటయే నీముఖ్యాభిప్రాయము. నీవు ఈ సభాప్రయత్న ములో నుండగనే నేను పరి గ్రామములు దోచి నిరాటంక ముగా దిరుగుచున్నాను. నన్ను బట్టుకొనుటకు బ్రయత్నిం చుట యనగా, నీవు మృత్యువు నాహ్వానించుకొనుటయని యెఱుంగుము. ఈకాగితపు సంచిలో నుంచబడిన ఎర్రగుడ్డ రక్తస్రవంతిలో దడిసి యారినది. ఇయ్యది మనుష్యరక్తమని గ్రహింపుము. ఈ హంతకురాలి చేతిలో నింతవఱకెందఱో

హేతువైరి. నీయందు నాకు ప్రత్యేకద్వేషము లేకున్నను, నన్నుబట్టి హింసింపవలయునను నభిలాషతో నీవు అడుగడుగునను బ్రయత్నించుచున్నందువలన నీయందు నాకు గల దయారసమంతరించినది. ఇఁక నిన్ను జంపి నీరక్తమును రాఁబొందులచే ద్రాగించెదను. ఇప్పటికైనను బుద్ధి మఱల్చుకొని శతమారినగు నాకు "దాసోహ"మనుము. అట్లుగానిచో నీ సభాసమావేశము పూర్తిగాక ముందు నీప్రాణవాయువులు అంతరించునని నమ్ముకొనుము. నీమేని రక్తముతో నా ఖడ్గమును గడుగుట నిశ్చయమని భావించుము. కళ్యాణరావు భార్యను బోగొట్టుకొని, అల్లాడుచున్నాడు. నీకును అదేగతి పట్టగలదని నా ప్రబోధము. అంతకంటె నీవు అధమగతిపాలగుదువు. నీవు నీ ఆలుబిడ్డలను గోలుపోయిన తరువాత నీశరీరము నక్కలపాలు చేసెదను. ఇందుకు సిద్ధపడి నీ ప్రయత్నములు సాగింపుము.

ఇట్లు,

శతమారి. "ఘోరనరహంతకురాలు."

ఈయుత్తరమును ముగించునప్పుడు భాస్కరరావు శరీరరక్తము కాగి మసలిపోయినది. భయచిహ్నమొక్కటియు నతనియందు గానరాలేదు. కళ్యాణరావు భార్యను గోల్పోయియున్నవాడగుటచే నతని చిత్తము కొంచెము భయసమన్వితమయ్యెను. తనభార్య నీమె చేజిక్కించుకొని వధించెనాయని ఇంచుక ఖేదము నొందెనుగాని, వెంటనే ధీరపద్ధతి నవలంబించెను.

# హంతక చూడామణి

## పదునాఱవ ప్రకరణము.



దేశమంతయు దోపిడులచే గగ్గోలమై యుండెను. కష్టముచేసి ద్రవ్యార్జనముచేసినవాడు తనద్రవ్యముననుభవించు భాగ్యము నొందలేకుండెను. కలిమిగలవారు నిదురలుచాలించి నడిరేయి మెలకువతోనుండి యిళ్ళుకాచుకొనుచుండిరి. ఒక గ్రామమునుండి మఱొకగ్రామమునకు బోవలయుననినచో నలుగురు ముగ్గురుకలిసి జట్లుగాప్రయాణము చేయుచుండిరి. చీమచిటుకుమనినచో గుండెలదటువాఱుచుండెను. కొన్ని కొన్ని గ్రామములలో ముష్టివాండ్రజట్టువలెవచ్చి యిండ్లలో జొరబడి ఎవ్వరికిని నపాయముజేయకయే దొరకినయంతవఱకు తినుధాన్యములను విలువగల యితరసాధనములను బలాత్కారముగ గొనిపోవుచుండిరి. జనులు గుంపులుగుంపులుగా గూడి శాంతియుతమగు జీవితములను నడపుకొనుటకు నుపాయము లేమని తర్కించుకొనుచుండిరి.

ఈపరిస్థితులిట్లుండ విలాసవతీనగరమున రక్షణశాఖా కార్యాలయముండెనను ధైర్యముతో రత్నాపురం విశ్వేశ్వరరావు వడ్డీవ్యాపారముచేయుటకై తరలివచ్చి విలాసవతీనగరమున నంగడితెఱచి నివాసముసేయుచుండెను. అప్పటి కతని సోదరియగు రత్నాంగియు నతనియింటనే నివసించుచుండెను.

కొలదికాలముననే పురపాలక సంఘాధ్యక్షుని యెన్నిక వచ్చెను. నగరవాసులు పలువురభిప్రాయము ప్రకారముగ విశ్వేశ్వరరావు పురాధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. ఒకదినమున గార్యాలయమున గాగితములు చూచుకొనుచున్న సమయములో ధాన్యకటకమునుండి యొక యాజ్ఞాపత్రము వచ్చెను. విశ్వేశ్వరరావు దానినీవిధముగ చదువుకొన నారంభించెను.

"దేశమున నపరాధుల విచారణలుచేయుటకు అధికోద్యోగియు గావలసివచ్చినది. నీవు పురపాలక సంఘాధ్యక్షుడుగా నెన్నుకొనబడినవార్త ఈకార్యాలయమునకు జేరినది. నీపరిపాలనమున బ్రజలు శాంతిసౌఖ్యముతో నున్నారని పెక్కురవలన వినవచ్చుచున్నది. అందువలన ప్రస్తుతము అపరాధులు పట్టుబడినప్పుడు వారివారి కృత్యాకృత్యములను విచారించి తగురీతిని, న్యాయశాస్త్రానుకూలముగ శిక్షవిధించు నధికారముగల న్యాయాధికారిగ నిన్ను నియమించడమైనది. న్యాయాధికారి కవసరమైన ముద్రోపకరణమును రేపటిటపాలో నీకుముట్టగలదు. న్యాయవిచారణ కార్యాలయముకొరకు నీవొకభవనమును, బ్రత్యేకస్థానమున నియమించి, కార్యాలయావశ్యకములన్నిటిని గుదుటపఱచి రేపటినుండి పనిప్రారంభింపవలసినది."

"శాతకర్ణి"

ఈ నూతన పదవీ లాభమువలన విశ్వేశ్వరరావు అంతరంగమున సంతసించెను. గాని, కార్యనిర్వాహణము అత్యంత భారముగలది యని మాత్రము తలపోసెను.

మఱునాటి టపాసమయమునకు ముద్రోపకరణము గల బంగీనిదెచ్చి తపాలవాడు విశ్వేశ్వరరావు కొసంగెను. ఆనాటినుండియు కార్యాలయ కార్యక్రమము నారంభించి విశ్వేశ్వరరావు యథోచితముగా న్యాయవిచారము సేయుచుండెను. ఆనాడే తపాలావాడు మఱియొక కాగితపు సంచిని గూడ విశ్వేశ్వరరావు కిచ్చెను. దానిని దెఱచి చూచి యత డిట్లు చదువుకొనెను.

విమిత్రమా ?

నీవు విలాసవతీ నగరమునకు న్యాయాధికారివిగా నియమింపబడితివను వార్తవిని నేనెంతయు సంతసించితిని. ఇప్పటి ప్రాంత పరిస్థితులు చాలవిషమించియున్నవి.

శతమారియను నొక దొంగలదోపిడి జట్టుల కధికారిణి, నిరంకుశముగా, నిర్భయముగా, దేశమునుదోయించుచున్నది. కళ్యాణరావు భార్యయగు సత్యవతీదేవి స్వరూపమే కనబడకుండబోయినది. కావున నిట్టి సమయములో నీవు అవలంబింపవలసిన పద్ధతిని వ్రాయుచున్నాను. అనుమానముపై నపరాధులనుగా నీయొద్దికి బంపబడినవారిని విచారణచేయకయే నిర్బంధావాసమునకు నుత్తరువు లీయవలసినది. అపరాధుల జట్లు ఎన్నోయున్నవి. వారికొకరితో నొకరికి సంబంధము కలిగియుండు నాచారము కలదు. సిరివంచలో పెద్ద జనసమావేశము జరుగనున్నది. ఈసమయమున బెక్కుమంది యపరాధులు జిక్కుపడగలరు. వారివిచారణ వెంటనే చేయక

పరిశోధన పూర్తియగునంతవఱకు నపరాధులను దొరికినవారిని నిర్బంధించియుంచుము.

పరిశోధనశాఖాధికారి.

భాస్కరరావు.

ఇయ్యదిచదివి భావముసేసికొని విశ్వేశ్వరరావు, శిరఃకంపము సేసెను. ఒకయపరాధినిబట్టి యితరాపరాధులను జిక్కించుట సహాజమేయని, భావించి, యట్లొనరించుట యుక్తమేనని నిశ్చయించుకొనెను.

శతమారి విశ్వేశ్వరరావును బంధించిననాడు తనకాతనిపై గలిగిన ప్రేమభావమునింకను జంపుకొనలేదు. నయముననో భయముననో మఱియెట్లో విశ్వేశ్వరరావును దనస్వాధీనము చేసికొనవలయుననియే తలంచుచుండెను. పాపికొండల పాతాళసదనముననున్న కాలమున విశ్వేశ్వరరావువిషయమై దండనోపాయమే ప్రయోగింపబడెనుగాని, సామోపాయము వినియోగింపబడియుండలేదు. శతమారి యూహించిన యూహాలుకొన్ని సార్థకములే యగుచున్నవి. న్యాయాధికారియైన విశ్వేశ్వరరావు శతమారి ప్రేమప్రపంచములో నిఱుకు బడియున్నచో నెట్టిపరిణామము సంఘటించెడిదో జెప్పనేఱము; కాని యట్లుజరిగియుండలేదు. శతమారి యీవిధముగ నొక్కలేఖవ్రాయించి విశ్వేశ్వరరావుకందునట్లు పైవిలాసము వ్రాయించి తపాలపెట్టెలో వేయించెను.

ప్రియవల్లభా! నాకునీపై ప్రేమభావముదయించి

యున్నదనువిషయము నీకుదెలిసినయంశమే. నిన్ను నిర్బంధ పఱచి యుంచినప్పుడవలీలగ నిన్ను స్వాధీనము చేసికొనవచ్చు నను సద్భావముతో నీపైకఠినచర్య తీసికొనియుంటిని; నిన్ను గొరడాలతో గొట్టించియుంటిని. అప్పటిపరిస్థితిననుసరించి నేను కఠినురాలననియు, నిట్టికఠినాత్మురాలితో ప్రేమానుబంధము పెట్టుకొనరాదని నీవు భావించియుండవచ్చును. నీపై నాకుగల గాఢానురాగము ఒడలు తెలియనిచర్యకు ప్రేరేపించినది, గాని, నిన్నునిజముగా బాధించవలయునని నాభావముకాదు. ఏదో విధముగ నీవునాచేకూర్పబడిన శారీరక నిర్బంధమునుండి తప్పించుకొని పోయితివిగాని నాయనురాగబంధమునుండి నీవు తప్పించుకొనిపోలేదు నీవు నాయభిలాష ననుమతింపవేని నాయందు నిక నాశారాహిత్య ముదయించును. దానివలన దొలుదొలుత నీపక్షము వారి నొక్కొక్కరిని చిత్రవధ చేయించి నీమనస్సునొప్పించెదను. అప్పటికిని నీవునాయను రాగము నందికొనవేని, ఈప్రేమ ఫలితముగ నెట్టివికారస్థితు లుత్పన్నమగునో చెప్పజాలను. మిత్రులయెడల నాయను రాగమెంత గాఢమైనదో, శత్రువులయెడల నాద్వేషముగూడ నంతగాఢమైనదని నీవుపరికింపవచ్చును. ప్రత్యుత్తరమున కెదురుచూచుచున్నాను.

ఇట్లు
నీప్రియురాలు శతమారి.



# హంతకచూడామణి

## పదునాలుగవ ప్రకరణము

నిర్బంధావాసములోనున్న సత్యవతీదేవి దురవస్థ చాల దుర్భరముగానుండెను. ప్రతిదినమును సత్యవతిని బంధనాగారములోనుండి బయటికిదీయించి మూపున బండయెత్తించుచుండిరి. నీవుమాజట్టులోగలసి దొంగలకు అన్నమువండిపెట్టుటకు అంగీకరించుమని నిర్బంధముచేయుచుండిరి. చింపిగుడ్డలు కట్టించి నిళ్ళకడవచేతికిచ్చి జట్టువాండ్రకందఱిముంతలలోను నీళ్లుపోయించుచుండిరి. పశువులనుశిక్షించుపెరణకోలల చబుకులతో గొట్టించుచు నీమగడు దోపిడిగాండ్రనేలకొట్టించును. అందులకుప్రతిగా నిన్నుమేము కొట్టుచున్నామనిరి. సరిగా పనిచేయనియప్పుడు చెంపదెబ్బలుకొట్టుచుండిరి. కొందఱు చేతికిమెలికవేసికొని నేలబడవైచి తన్నుచుండిరి. ఇంకను వర్ణనాతీతములగు హింసలుపెట్టుచుండిరి. తుట్టతుదకొక్కయుత్తరము వ్రాయించి దానిపైసత్యవతిచే చేవ్రాలుచేయించిరి. ఆలేఖలోని యంశములిట్లుండెను.

కళ్యాణరావు గారికి,

అనాధబంధూ! ప్రాణేశ్వరా!

నన్నిచ్చట దోపిడిగాండ్రపట్టుకొని నిర్బంధించి యున్నారు. నేనుకఠినశిక్ష ననుభవించుచున్నాను. నాలుగైదు

దినములకొకసారి యిచ్చటనిర్బంధితులను వధచేయుచుందురు. ముఖ్యముగా అపరాధపరిశోధకులకు సంబంధించిన వారినందఱిని గుత్తుకలుగోసి చంపివేయుదురు. రేపు సిరివంచలో జరుగనున్న సభాసమావేశము సమయమునకు నన్నుగూడ సిరివంచకు బ్రయాణచేయవలయునని శాసించుచున్నారు. ఇంత యవమానముపొందిన నాకింక జీవితములపై యాశలేదు. కాని మరణించుటకుబూర్వము, నాప్రాణేశ్వరులైన మిమ్మునొకసారి చూడవలయునని నామనం బపేక్షించుచున్నది. ఈ దీనురాలి యందు దయయుంచి మీరును ఆసమావేశమునకు సిరివంచకు రావలయునని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
మీధర్మపత్ని సత్యవతి.

అప్పటికి సిరివంచలో నేర్పాటులు చేయుటకు వచ్చియున్న కల్యాణరావు కీలేఖ హస్తగతమయ్యెను. కల్యాణరావు లేఖ విప్పి చదువుకొని కన్నీరు మున్నీరుగా గార్చ నారంభించెను ఆసమయమున భాస్కరరావు కళ్యాణరావు వద్దకువచ్చి సాదర వాక్యములుసెప్పి యిట్లు సంభాషించెను.

"భాస్కరరాయా! సత్యవతిని జెఱనుండి తప్పించుటకు మనము చేయవలసిన దేమి ?"

"ఇప్పుడు మనము పన్నిన పన్నాగ మన్నివిషయములను సాధించును. శతమారి స్వయముగా బయలుదేరి వచ్చునది కాదు. కాని యామె పరిజనము తప్పక యీ సమావేశ

మునకు వత్తురు. వచ్చినవారిని రాబట్టుటయేకాని, బయటికి బోవునప్పు డందఱి పరిస్థితిని బరిశోధించి పంపవలయును. ఈ జనములో శతమారికి సంబంధించినవారు కొందఱు దొరుకు దురు. వారిని నిర్బంధించి శతమారి గుట్టు తెలిసికొని యామెను బట్టునుపాయ మావెనుక యుపయోగింపవలెను."

"కాని సత్యవతి కేహానియు గలుగకపూర్వము మనము శతమారిని బట్టవలయును."

"అట్లే జరుగగలదు. ప్రజలలో కొందరి సహాయము మన కవసరమగును."

"అందుకు దగిన సన్నాహము సేయుదము."

పదంపడ సిరివంచ నివాసులగువారి న నేకులను, భద్రాచల గ్రామ నివాసులను గొందఱను, మఱియు విలాసవత్యాది నగరములనుండి వచ్చిన వారిని గొందఱను, దోపిడిమూకలను బట్టుటకు సాయపడవలయునని యభ్యర్థించి యంగీకరింపజేసిరి. ఆహ్వాన సంఘసభ్యుల యాదేశముల చొప్పున వచ్చిన వారి కెల్లరకు స్వాగత మొసంగుటకు నియమింపబడినవారివలె ప్రజలు నియమిత వేషములను, చేతికర్రలనుధరించి, గ్రామము చుట్టును స్వయంసేవకులపంక్తి యొక్కటి నిర్మాణము సేసి వచ్చినవారికెల్ల నాదరవాక్యములు చెప్పుచు వసతి స్థానముల జూపించిరి.

సభాసమయము సమాగమించెను. మహిళాసమావేశములో గొన్ని యుపన్యాసములు జరిగెను. కళ్యాణరావును

భాస్కరరావును, సభాభవనమున నించుకంత గూర్చుండి వచ్చిన జనమునెల్ల పరీక్షించి చూచిరి. వారికి గావలసిన ముఖ్యవ్యక్తులం దెవ్వరును లేకుండిరి.

మధ్యాహ్నము తిరిగి యుపన్యాసములు ప్రారంభింప జేసి పెద్దబజారులో నేర్పరుపబడిన పానీయశాల కేతెంచిరి. తమ యంగరక్షకులగు కొందఱు రక్షకభటులను దమవెంట గొంతదవ్వున నడయాడ నియమించుకొనిరి. ముఖ్యస్థానముల యందు సాయుధులగు రక్షకభటులను నియమించిరి.

అధికారు లిరువురును పర్ణశాల యంగడి మోల నేర్పడి యున్న పందిలిలో గూర్చుండిరి. ఏవో యంశములను గుఱించి బాహ్యముగ ముచ్చటించుచు నప్పుడప్పుడు పానీయ రసపాత్రలను దెప్పించుకొని త్రావుచు వచ్చిపోవువారి నరయు చుండిరి. కొందఱువచ్చి పానీయము ద్రావుచుండిరి. కొంద రింతసామ్మ్రాయని వాని వెలల నధిక్షేపించుచుండిరి. కొందఱు పర్ణశాలలోని యంగనలవైఖరి నరయుచుండిరి. అంతలో నొక యువతీమణి, చాటుననున్న యరకుబోయెను. ఒక్కపర్యాయ ముగ పందిలి జారి క్రిందబడిపోయెను. దాని క్రిందనున్న సభ్యులనెత్తిపై బరువుగల పందిలి పడుటచే కొంద అప్పుడే యుసురులబాసిరి. కొందఱు ప్రక్కప్రక్కగూరుచున్న వారు కొద్దియపాయముతో దప్పుకొనిరి. కళ్యాణరావుకును భాస్కర రావుకును మోపైన దెబ్బలు తగిలినవి. భాస్కరరావెట్లో కట్టెలక్రింపగ వెలుపలికి బ్రాకి యొడలు దులుపుకొనియెను.

కళ్యాణరావు మూలుగుపెట్టుచు పందిలి కట్టెల క్రిందనే పడి యుండెను.

అంతలో రక్షకభటులును, గొందఱు స్వయంసేవకులును పందిలిని లేవనెత్తి క్రిందబడియున్న వారిని బ్రతుకు దప్పించిరి. కళ్యాణరావును జేతులమీద దీసికొనిపోయి విశ్రాంతి భవనమున నుంచిరి. అతనికి సేదదీర్చుచు సేవ సేయుటకై నలువురు స్వయంసేవకులు కళ్యాణరావువద్ద గూర్చుండిరి.

భాస్కరరావు భద్రతానినాదము చేసి, అపాయసూచకమగు చిహ్నమును బ్రకటించెను. ముప్పదిమంది రక్షకభటులు అంగడిపర్ణశాలను జుట్టుముట్టి యందున్న పడతుకలనందఱిని బట్టుకొనిరి. అంగడికి సంబంధించినజట్టు ముప్పదిమందివఱకు నుండిరి. అందఱికి జేతులకు అరదండాలు వేయించి ఆరు మూకలుగా విభజించి, ధర్మశాలలోని ఆరుగదులలో బంధించిరి. రక్షకభటులతోపాటు నూరుమందిస్వయంసేవకులు లాఠీలతో గాపలాగాయుచుండిరి. ఈజట్టులలో నెవరెవరుండిరో యిఁక ముందు మనము తెలిసికొనవలసియున్నది. భాస్కరరావునిమున్నైన నేమరపాటులేక కార్యక్రమము నడపుచుండెను.

ఇంతకుముందే కొంచెముకొంచెము స్మృతి గలిగి కూర్చుండియుండిన కళ్యాణరావుకీవార్తను రక్షకభటులు దెలిపిరి. కళ్యాణరావు ఎట్లో ఓపిక చేసి ఒకసుఖపీఠమును ధర్మశాల యొద్దకు దెప్పించి రక్షకభటులకు దగుప్రబోధము సేయుచు

విశ్రాంత్యనుకూలముగా గూర్చుండియుండెను. ధైర్యోత్సాహ ముల కారణమునఁ గళ్యాణరావు శీఘ్రకాలమున స్వస్థచిత్తు డయ్యెను. నదిలో ప్రయాణముచేయుచున్న యొకపొగయోడ యజమానికి ప్రత్యేకాజ్ఞల నొసంగునట్లుచేసి యారాత్రి మొదటిజాము నిర్గమించకముందే, సిరివంచరేవు కొక పొగ యోడ దెప్పింపబడెను.

గ్రామములోనిప్రజలెల్లరు గుంపులుగుంపులుగా వచ్చి ధర్మశాల కిటికీలలోనుంచి నిర్బంధితలగు యువతులను వింతగా జూడసాగిరి. మహిళాసమావేశము సమాప్తియైనవెంటనే స్త్రీలెల్లరును ధర్మశాలయొద్దికిబోయి, యాదుర్మతులనందరు వీక్షించుచు ముక్కులవ్రేళ్లువైచుకొనుచు, ఎంతపనిచేసిరియని యచ్చెరువుతో జెప్పుకొనసాగిరి. సభాసమావేశములో బాలొనవచ్చిన రత్నాంగి భూతదయాపరురాలగుటచే, బిరబిర పోయి యాయువతులకందఱకును నన్నపానముల నొసంగు నేర్పాటుచేయించెను. తన్నునిర్బంధించిన శతమారి యాసంఘ మున గానరాలేదని యామెయెంతయో పరితాపము చెందెను.

రాతిరివేళ మొదటిజాము గడువవచ్చినది. కళ్యాణ రావు, భాస్కరరావు రత్నాంగి, మువ్వురును, ఈ ముప్పది మంది దుర్మతులను రేవునకునడపించి పొగయోడలో, నెక్క జేసిరి. ముప్పదిమంది రక్షకభటులును నాయోడలో నధిరో హించిరి. అంతలో మఱియొక పొగయోడయు, నాలుగు

నావలును వచ్చెను. మిగిలిన రక్షకభటులను స్వయంసేవకులను మఱికొందఱు ప్రజలను వానిలోనెక్కించిరి. ఆయోడలను నావలను నొక్కసారిగావిడిచిరి. గాడుపు ఓడల కనుకూలముగ నుండెను. నాలుగుగంటలకాలముమీఱకమున్న ఓడలన్నియు, విలాసవతీనగరమునకు సమీపముననుండు రేవునకు జేరెను. తెలవారు పూర్వమే విలాసవతినుండి శకటములు, గుఱ్ఱపు బండ్లు రేవునకు వచ్చెను. వారెల్లరును విలాసవతికి జేరి న్యాయాధికారి ఆజ్ఞ ప్రకారము ముప్పదిమంది దోపిడి జట్టును కారాగారములలోఁ దగురీతి బంధింపఁబడిరి. అన్యు లెల్లరు తమ తమ కార్యక్రమములో నిమగ్నులై యుండిరి.

# హంతకచూడామణి

## పదునైదవప్రకరణము.

---

ఆహిరీ పాతాళసదనములో సత్యవతీదేవి బంధింపబడి యున్న చెఱసాలలో నిప్పుడు మఱియొక వ్యక్తి ప్రవేశ పెట్టబడెను. ఈమెవయస్సు యిరువది సంవత్సరములవఱకు నుండును. వారిరువురును జీకటికొట్టులో నుండి యిట్లు మాటాడుకొనజొచ్చిరి.

సత్యవతీదేవి యానూతనయువతింజూచి "యమ్మా నీపేరేమి ?" యనెను.

నాపేరు "ఛాయాదేవి"

"నీవు నివసించు గ్రామమేది ?"

"విలాసవతీనగరము, ప్రస్తుతనివాసము"

"అంతకు పూర్వమేదో మఱియొక ప్రాంతము మీ నివాస స్థానమైనట్లు తోచుచున్నది. అది ఎక్కడ ?

"తొలుదొల్త మానివాసము ధాన్యకటకము."

"ధాన్యకటకమున నీవెవ్వరి కుమార్తెవు ?"

"నేను మాధవరావుగారి కుమార్తెను."

"వారేయుద్యోగమున నుండిరి ?

"ధాన్యకటకమున న్యాయసభాధ్యక్షులు."

"మీరు విలాసవతీనగరమున కేలవచ్చితిరి?"

"నాపతికి విలాసవతీనగరమున నుద్యోగము గలదు.

"ఏమి యుద్యోగము"

"అపరాధ పరిశోధన శాఖాధికారి"

"అట్లయిన నీవు భాస్కరరావుగారి భార్యవా?"

"అవును."

"నీవి శతమారిచేత నెట్లు చిక్కుకొంటివి?"

"కాలవశమున నే చిక్కుపడితిని"

"అదియెట్లు"

"ఆవిషయము నేను విశదముగ జెప్పెదను" తొలుత మీరెవ్వరో చెప్పగలరా?

"అమ్మా నేనొక నిర్భాగ్యురాలను."

"మీ పేరేమి?"

"నా పేరు సత్యవతీదేవియందురు."

"కళ్యాణరావుగారి ధర్మపత్ని మీరేనా?"

"అమ్మా! అవును నాకే యీ దుర్గతి పట్టినది."

"చాల విచారమైనసంగతి. కాని యిక మీరు ధైర్యము నవలంబించియుండవలయును."

"నీవే నాకు ధైర్యకారణమవు"

"ధైర్యము వదలకుము. సర్వమును బరిపాలించు దయామయుడగు పరమేశ్వరుడు అన్నియు జూచుకొనుచునే యుండును."

"నీ వెట్లు మోసగింపఁబడితివో చెప్పవైతివి?"

"రెండుదినములక్రింద నాభర్తయగు భాస్కరరావు సిరివంచలో జరుగుచున్న మహిళామండలీ సమావేశ సందర్భమునఁ దగు నేర్పాటులు గావించుటకు బోయియుండిరి."

"ఆ సమావేశమునకు నీవుపో లేదా?"

"ఇంటికడ నెవ్వరును లేకుండఁ బోయినచో నేమి యపాయమోయని నాభర్త నన్నింటివద్ద నుండుమనిరి."

"అంత నేమైనది."

"సాయంకాలము చీకటి పడినతరువాత నొక బీద రాలు మాయింటికి సంజకబళమునకు వచ్చినది. "ఒక ముద్ద వేయి అమ్మా" అని వేడుకొన్నది. వెంటనే నామెయందు గనికరము పూని, వెంటనే యింటిలోనికిబోయి ఒక చిన్న పళ్ళెరమున, యించుకయన్నమును, మఱికొన్ని పదార్థములను బెట్టుకొని, యాభిక్షుకి మోలనిలచితిని. "తల్లీ, మెట్లు దిగి క్రిందికివచ్చి నెమ్మదిగా సంచిలో పడునట్లు వేయుమని యామె ఒక అడుగు వెనుకకు వైచినిలచినది."

"నేనును నాయింటి మెట్లక్రిందికివచ్చి, జాగ్రత్తతో నాసంచిలో నన్నము వేయుచుంటిని."

"చల్లని తల్లివి. చక్కగా బ్రతుకుమమ్మా యని ఆపె నాపై నేమో భస్మము చల్లినది."

"అట్టితఱి, నాకు స్మృతి తప్పినది. ఆవెనుక నేమిజరిగి నదో నేనెఱుంగను."

నాకు కొంచెము కొంచెము తెలివివచ్చినసమయమున జూడగా నెచ్చటికో ప్రయాణముచేయుచున్నట్లును, నల్లని యుయ్యాలలో సుఖముగానూగుచున్నట్లును తోచినది. నేనట్లే కన్నులుమూసికొని యొకబండిపై పండియుంటిని. తలబరువుగా నుండుటచే నే నామెనేమియు మాటాడించలేదు. కొంతతడవు నకు నాకు మైకమువిడిపోయినది. అప్పటికి నేను నిర్బంధములో నున్నట్లు గ్రహించితిని. నాపత్రిక్క నెమిారుంటిరి. మఱి రెండు నిమిషములు విచారించుకొనగా, నొకచురాత్ముడరాలు నన్ను మోసగించి తీసికొనివచ్చి, ఈగుహాంతరాళమున నన్ను బంధించినదని గుర్తించితిని."

"ఈ సమాజము దేశము నీవిధముగ మోసగించి, సొమ్ముదోచుకొని, క్రూరహత్యలుసైతము సేయుచున్నది." ఇట్టి గూఢస్థానములయందు నునికిసేసి మహాపాపభూయిష్ఠమైన మార్గముచే జీవించుచున్నారు. మనము వీరికార్యమునుండి తప్పికొనుమార్గము లేదుగదాయని దుఃఖపిల్లుచున్నాను"

"దేవీ ! భయపడకుము. ఇదిశతమారి మాయాకృత్యము దీని పాపమయజీవితమునకు అంతకాలము సమీపించు చున్నది."

"అందులకేమైన నిదర్శనముకలదా?"

"ఈమెయిప్పుడు, ఈకెలుదీయబడిన కోడిపెట్టవలె తయారైనది." అనిపల్కి సత్యవతితో ఛాయాదేవి రహస్య ముగ మఱికొన్నిమాటలు చెప్పినది."

తోడనే సత్యవతీదేవి మొగమున ధైర్యోత్సాహములు అంకురించినవి.

"అట్లయిన మనమిప్పు డేమిచేయవలయునని సత్యవతి యాతృతతోఁ బ్రశ్నించెను."

"ఇప్పుడు మనమేమియుఁ జేయనక్కఱలేదు" ఈ సామాజకుల చర్యయంతయు గమనింప వలయును. మనమే యీ పాపరాశి జీవితనాశమునకు గారణముగాగలము. ధర్మవిప్లవము ఉత్కటస్థితిని జెందినప్పుడు పరమేశ్వరుడు స్వయముగా నుద్భవించునని పెద్దలు చెప్పుదురు. పరమేశ్వరునియందును సత్య ధర్మములయందును విశ్వాసము గలవారి కెన్నిటికిని అపజయము లేదు."

ఇట్లు మఱికొంతతడవు ప్రసంగము చేసి యుభయులును నెమ్మదిగ గూరుచుండి, చెఱసాల ద్వారములోనుండి, అందేమిజరుగుచుండునో శ్రద్ధగా గమనించుచు గూరుచుండిరి.

అట్టితఱి నిద్దఱు పడంతులు చెఱసాల ముంగిలి భాగమునకువచ్చి కూర్చుండి ప్రసంగము చేసికొనసాగిరి. వారు రెండు చిన్నమూటలను దెచ్చిరి. ఇద్దరు మగవాండ్రును రెండు సొమ్ముమూటలు తలలపై మోసికొని వచ్చి వారి యెదుట గూర్చుండిరి, వారు నలుగురును నీవిధముగ బ్రసంగములు సాగించిరి.

"అబ్బా! ఈవృత్తి చాలా కష్టమయినది."

"ఏమికష్టము? ఎవడో సంపాదించి దాచిపెట్టినసొమ్ము జాగ్రత్తగా దొంగిలించినయెడల చిరకాలము నెమ్మదిగా గూర్చుండి కుడువవచ్చును.

"కూర్చుండి కుడుచుదినాలు వెనుకకుబట్టినవి"

"ఏమయినది!"

"ప్రతినగరంలోను వీధివీధికి రక్షకభటులు స్వయం సేవకులు కావలి కాయుచున్నారు. రాత్రి నాలుగుజాములు ప్రజలు గస్తీ తిరుగుచున్నారు. ఈ సందర్భములో కన్నము వేయుటయే కష్టమయినది. మెలకువతో నున్నవాళ్ళ యిండ్లలో బ్రవేశించుట ప్రాణాంతము. సొమ్ము తీసికొని బయలు పడినవేళ నెవనికంటఁబడినను వాడు వెంబడించును. వాని బారినుండి తప్పించుకొని వచ్చుటయు కష్టసాధ్యమే.

ఇప్పుడు అపరాధపరిశోధకులసంఖ్య ఎక్కువఅయినది. మన జట్టులోవాళ్ళను జాలమందిని పట్టుకొనినారని విని యున్నాను."

"అందువల్లనేగావచ్చు. ఇక్కడ యేమి శబ్దమే లేకుండనున్నది. ఒక్క ఆడుమనిషియైన గనబడదే?"

‘‘ఇంక నేమి యాడుమనిషి. మనదోపిడీ జట్టులో ఆడవాండ్రను ముప్పదిమందిని నిన్న పట్టుకున్నారట.’’

‘‘అబ్బా మన అమ్మగారేమిచేయుచున్నది?’’

‘‘ఈ సంగతి ఇంకను ఆమెకు తెలిసియుండదు.’’

‘‘అట్లయినచో నేను దెలియజేతునా?’’

‘‘తెలియజేయుము. నిజముగా మన జట్టులో ముప్పది మంది పట్టుబడినయెడల, ఇక మన గుట్టు బయటపడకతప్పదు. మనమిక్కడ ఉండడంకూడా అపాయకరమే.’’

‘‘సరే! శతమారి దగ్గరకు నడువుడు.’’

నలువురును శతమారిని దర్శింపబోయిరి.

---

# హంతక చూడామణి

## పదియారవ ప్రకరణము.

---

ముప్పదిమందియాడువాండ్రు పట్టుబడినవార్త శతమారి చెవినిబడినవెంటనే, శతమారి యిఁక ప్రాణరక్షణము చేసికొనవలసిన సమయమువచ్చినదని తెలిసికొనినది. తనయొద్దకువచ్చి యీవార్తచెప్పిన, దశమారికి సహస్రమారిని మోలనుంచుకొని ఇక మనకర్తవ్యమేమని ఆలోచించినది. "ఒకరు పట్టుబడినయెడల మిగిలినవారు విడిపించుప్రయత్నము సేయునట్లుండవలయును. కావున మనముముగ్గురము వేఱువేఱు తావులయందే యుండవలయును"

అని ముగ్గురును సమ్మతముగా తీర్మానించుకొనిరి. దశమారి తిరిగి మిగిలినదోపిడికాండ్రతో పాపికొండల పాతాళభవనమున నుండుటకే నిశ్చయింపబడినది. యోగినిగా పనిచేసి వచ్చిన సహస్రమారి ఏదోమఠియొకవేషమున భద్రాచల సమీపముననే నుండవలయునని నిశ్చయింపబడినది. శతమారి ఆహిరీకనుమలలోనేయుండి, యాత్మరక్షణము చేసికొనుచు శత్రుమారణప్రయత్నము చేయవలయునని నిశ్చయింపబడీనది. అప్పటికి బట్టుబడినవారు గాక ముప్పదిమంది మగవాండ్రుమాత్రము రాశిపైనుండిరి. ముప్వురి యొద్దను మూడు తావులయందు పదిమంది చొప్పున మాత్రమే దిరుగుచుండ

వలయునని నిశ్చయింపబడినది. ఏ యుపాయమెక్కడ జరిగి నను ఘడియకాలములో మూడు తావులకు వర్తమానము తెలియజేయబడునట్లు దోపిడికాండ్రలో నేర్పాటులు చేయ బడినవి. ఇంక గొన్నినాళ్ళవఱకు దోవలయందు ప్రయాణము చేయు బాటసారులను మాత్రము దోచుకొని ధనార్జనము చేయుచుండవలయునను తీర్మాన మంగీకరింపబడినది.

సహస్రమారి పదిమందిజట్టును తనకుగావలసిన ద్రవ్య మును దీసికొని యెల్లరకును గంగిరెద్దువాండ్ర వేషములు వేయించి యొకమేళముసిద్ధముచేసి తానును స్వరూపమును మార్చుకొని, పురుషవేషమునే ధరించి భద్రాచలమునకు బోయెను. ఆగ్రామమున కనతిదూరమై గోదావరికి నుత్తర ప్రాంతముననున్న యొకగుట్టక్రింద తావుచేసెను. గోదావరి యాప్రాంతమున నదీరమునకుగోసి యేబదిగజములవరకు భూమి లోనికి జొచ్చియుండెను. గుట్టక్రిందగల బిలములోనుండి యాగోదావరిపాయకు నొకమార్గము శుభ్రముచేయించెను. గుట్టపైన పదికుటీరములువేయించి దానికి గంగిరెద్దుగూడెమని పేరుపెట్టెను. చేపలుపట్టి జీవనముచేయు నొకబీదవానియొద్ద నొకచిన్నచిన్ననావను వెలకుదీసికొని యానావయెల్లప్పుడును గుట్ట క్రింది గోదావరిపాయలోనుండునట్లు యేర్పాటు చేయించెను. ఈజట్టువాండ్రు పూర్వమువలెసాహసించి పల్లెలలోను పుర ములలోను బ్రవేశింపక, రాత్రివేళ పెద్దదండుబాటలనుగాంచి బాటసారులను దోచుకొనుచు, నిశ్శబ్దముగ గాలయాపనము చేయుచుండిరి. భాస్కరరావు ఏబాటలోప్రయాణముచేయుచు

నగపడినను, మాఱుమాటాడక హత్యచేయవలయునని తన దోపిడిగాండ్రకాజ్ఞ నొసంగెను.

శతమారి స్థానమును మార్చుట యుత్తమమని నిర్ణయించుకొని, మిగిలినజట్టుగాండ్రలో దొమ్మరియాట నేర్పరితనముతో జూపగలవారి నేఱుకొని, వారిని వెంటబెట్టుకొని పాపికొండల పాతాళసదనములోనికే ప్రవేశించెను. పూర్వమందున్న ముఖద్వారమును బెద్దపెద్దగండశిలలతో బూడిపించి గోదావరిలోనికి జేర్చు సొరంగమునుమాత్రమే రాకపోకలకుత్రోవగా నియమించెను. కాని శతమారి తన యున్నచోట మిన్నక కూర్చుండుట కంగీకరింపలేదు. తానుస్వయముగ నాట్యకళయం దాఱితేఱినదగుటచే, దొమ్మరియాటవాడు నాటకాండ్రతో దానుబయలుదేరి గ్రామములలో సంచారము చేయుటకు నిర్ణయించుకొనెను. దొమ్మరియాట, సాముమున్నగు విద్యలు ప్రదర్శించునప్పుడు, వినోదముచూచుటకు భాస్కరరావు వచ్చినయెడల వెనుకముందుచూడక ఏదోఒక ముసుగుచూచుకొని గూఢముగనుండి కాల్చివేయవలయునని యానతిచ్చెను. అవకాశముదొరికినచో నాటమధ్య గత్తిసాము చేయుచు, మెల్లమెల్లగ సమీపించి భాస్కరరావును బొడిచి వేయవలయునని యానతిచ్చెను.

దశమారి యూ, యూహిరీ కనుమయందే యుండ నంగీకరించెను. తనజట్టువాండ్రనందఱను యింద్రజాలవిద్యలు ప్రదర్శించుటకును గోతులనాడించుటకును నియమించెను. దశమారి య్యూహిరీకనుమలలో మఱియొకబిలమునందు

నివాసము నేర్పఱచుకొని, పూర్వికమగుస్థావరమును త్యజించెను ఇంద్రజాలవిద్యాప్రదర్శన సమయమున నేయూర నేతావున భాస్కరరావగపడినను వెంటనే యేదోఒక కారణమున పోరాటము బెట్టుకొనవలయుననియు వెనుకనుండువారు పిస్తోలుతో గాల్చివేసిగాని; కత్తితో బొడిచిగాని చంపివేయవలయునని తన యనుచరులకు దశమారి యాజ్ఞాపించెను. ఈపోరాటములో సాహసమున నెవ్వడుప్రాణముగోల్పోయినను వానికుటుంబ మును దానుపోషించుట కనుమతిచెప్పెను.

ఇట్లు సహస్రమారియు, శతమారియు, దశమారియు, మూడుస్థావరములయందు నునికి నేర్పఱచుకొని యేదినము చర్యల నాదినమే తమవారికెఱుంగజేసికొనుచు, నాలుగయిదు దినములుమాత్రము, సుఖముగాగడపిరి. దశమారి స్వాధీనము లోనున్న ఛాయాదేవియు, సత్యవతియు, నొకదినమున ద్వార రక్షకునిచే దశమారి యొక్కసారి దర్శనమీయవేడుచున్నార మని యామెయొద్దకు వార్తనంపిరి. నిర్బంధితులు తమకష్టసుఖ ములను యజమానులకు జెప్పుకొనుట యాచారముగనుక దశమారి ద్వారరక్షకుని వార్తప్రకారము వారున్న చెఱసాల యొద్దికివచ్చెను. ద్వారపాలకునితో నోయీ యీద్వారము తెఱచి యీనిర్బంధితయువతులను బయటికంపుమని గంభీ రముగా నాజ్ఞాపించెను.

ద్వారరక్షకుడు ద్వారము తెఱచినవెంటనే ఛాయాదేవి వెలువడెను. ఆమెవెంటనేసత్యవతియు బయలుపడెను. పదంపడి వారుమువ్వురకును నీసంభాషణముజరిగెను.

ఛా "తల్లీ నీవుచిరకాలమునుండి యీగుహాంతరాళమున కాధిపత్యమువహించి నిన్ను శరణమువేడినవారి నెందఱినో రక్షించితివి. అనేకకుటుంబములకు నీవు బ్రతుకు తెరువుజూపితివి. మేము నీకేవిధముగను నపకారముజేసిన వారముకాము. అది యునుంగాక నిరపరాధినులమైన స్త్రీలము మమ్ము చిరకాల నిర్బంధావాసముననుంచి, ప్రాణాపహరణము సేయుచో నీకు స్త్రీహత్యాదోషము సంఘటించుటయేకాని మావలన నీకే యుపకారమును జరుగదు. మాప్రాణములను నీవుకాపాడితివేని, విద్యావతులమైనమేము నీయుపకారమునకు బ్రత్యుపకారము చేయగలము."

సత్యవతి చిరకాలమునుండి చెఱసాలలో నుండుటచే సరియైన భోజ్యాహారములేక, కృశించి నేలపైబడి మాపో రేపో మరణింపనున్నదానివలె నగపడెను.

ప్రకృతి ప్రేరణమున నెంత కూరహంతకులకైనను నొకప్పుడు దయారస ముద్భవించును. దళమారికి వారిపై కనికరము గల్గెను. కాని వారినివిడుచుట రాజ్యతంత్రము గాదనియు నట్లు చేసినచో దన ప్రాణమునకు ముప్పువచ్చునని యోజించెను. వారికిట్లు జవాబుచెప్పెను.

"నేను సర్వస్వతంత్రురాలను గాదు. నాపై నింకను నిరువు రధికారిణులున్నారు. వారిచే నిర్బంధింపబడిన మిమ్ము లను నేను విడిపించినచో నాపై వారాగ్రహముగొని నన్ను గాల్చివైతురు. కావున నాస్వాధీనములో నున్నంతవఱకు

మీకవకాశ మొసంగెదను. అంతటితో మీరు తృప్తిచెందుడు, ఇప్పటి వఱకు మీరొక చెఱసాలలో బాధపడుచుంటిరి, నేటినుండి మీరీ చెఱలోనుండ నవసరము లేదు. ఈ పాతాళభవనమునందంతటను మీరు విహరించవచ్చును. మాయనుచరులందఱితో స్వేచ్ఛగా మాట్లాడవచ్చును. కాని మీరీసదనము దాటి యెందును బోరాదు. అట్లు యత్నించితిరేని మా క్రూరభటులు మిమ్మొక్కుమ్మడిగ గాల్చివైచెదరు. భవనాంతఃప్రదేశము మీయిష్టానుసారము దిరుగుచు, లభించిన పదార్థములనెల్ల దినుచు సుఖముగ నుండుడు. మీవలన నాకేమైన యుపకారము గావలసివచ్చి మిమ్ములను నేను గోరినప్పుడు నాకు దోడ్పడుడు. పరమేశ్వరుని యిచ్ఛయైనచో మీరు దగుకాలమున స్వతంత్రులు కావచ్చును." అని తెల్పి, యిట్టి యవకాశము వారికొసంగుడని తనయనుచరులకును దెలియజేసెను. అనుచరులనుబిల్చి వీరు మనచే నపకారము పొందిన శత్రుకోటిలోని వారుగనుక, వీరిపై బ్రత్యేక దృష్టియుంచి భద్రముగా నుంచవలయునని తెలియజేసెను. "ఛాయా సత్యవతులు" ఇంతవఱకు మృత్యుముఖమునుండి తప్పుకొంటిమి. ఇంక సర్వస్వాతంత్ర్యము నార్జించుట కేమియుపాయమని పరస్పరము విచారము సేయుచుండిరి.



# హంతక చూడామణి

## పదియేడవ ప్రకరణము

విలాసవతీనగరమున నిర్బంధమున నుంచబడిన స్త్రీల నొక్కొక్కతెనుగా బిలిచి, భాస్కరరావు, కళ్యాణరావులు వాఙ్మూలములను దీసికొనిరి. వారిలో నొక్కతె యిట్లు చెప్పెను.

"నీ పేరేమి ?"

"దయావతి."

"నీయూరెచ్చట ?"

"రాజమహేంద్రవరమునకు ప్రాంతముననున్న జనపదము. దానిని మధురాపురమందురు."

"నీ వీ జట్టులో నెట్లుచేరితివి ?"

"సహస్రమారి యొక్క యాజమాన్యముక్రింద దోపిడి చేయవచ్చిన కొందఱు దోపిడిగాండ్రు నన్ను బట్టుకొని "నీవు మాజట్టులో చేరవలయును. లేనిచో నిన్నిచ్చటనే బొడిచివేసెదను" అని బాకుదూసి నా రొమ్ముపై నుంచెను. ఆ సేతకు భయపడి నే నందుల కొప్పుకొంటిని."

రెండవ యువతి యిట్లు చెప్పెను.

"నాయది మాధవపురము. నాపేరు మాధవి. కులము నకు నేను గొల్లదానను. దోపిడిగాండ్రు నాయింటజొచ్చి. "నీవు మాజట్టులో కలిసి దోపిడిచేయవలయును. లేనియెడల నీయావుల నన్నింటిని నఱికి నిన్ను చిత్రవధచేయుదుమని బెదిరించిరి. నాయావులను లేగలను నేను జాల ప్రేముడితో బెంచుకొంటిని. వాటివధ నేను గన్నులార జూడజాలక "మీరేమి చేయుమన్నను జేసెదను. కాని నాగోవులను మాత్రము రక్షింపవలయునని వేడితిని. వారందులకుసమ్మతించి నాగోవులను విడిచిరి. ప్రతిదినమును నేను నాయావుల నరణ్యములలో మేపి, సాయంకాలమున బోలుపిండుకొనివచ్చి వారి కిచ్చుచుంటిని. పాలు చాలనినాడు వారు నన్ను తీవ్రముగ దండించుచుండిరి."

ఈ విధమున నెల్లరును దాము బలాత్కరింపబడి దోపిడి గాండ్రలో కలుపుకొన బడినట్లును, నిర్బంధితులై వారికి సేవచేయుచున్నట్లును జెప్పిరి. ఎవ్వరును స్వయముగా ధనార్జనము కొఱకుగాని, బుద్ధిపూర్వకముగా హత్యలుచేయుటకు గాని దోపిడి గాండ్రలో గలిసినవారు లేరని వాఙ్మూలముల వల్ల విశదమైనది. మఱికొందఱిని భాస్కరరావు బెదిరించి యీక్రిందిప్రశ్నల నడిగి ప్రత్యుత్తరముల వ్రాసికొనెను.

"సమాసమారి యిప్పుడెచ్చటనున్నది ?"

"ఆమె ఒకనాడొక తావునను, రెండవజామున నే మఱియొక తావునను దిరుగుచుండును."

"మొత్తముమీద మీకు రహస్య స్థావరములెన్ని యున్నవి ?"

"మూడు తావులున్నవి."

"అవి యెంచుగలవు"

"ఆహిరీ కొండలు, పాపికొండలు, భద్రాచలమువద్ద నున్న గుట్టలు."

"ఈమూడు స్థానములలో శతమూరి యెచ్చటనున్నదో చెప్పగలవా ?"

"మేము సిరివంచ వచ్చునాటి వఱకు ఆహిరీ కొండలలో నుండెను."

"దశమూరి యెచ్చటనుండెను."

"ఆవిషయము నాకు దెలియదు."

"ఇప్పుడెవ్వ రెచ్చట నుందురో ఊహింపగలవా ?

"ముప్వురును మూడు స్థానములయం దుండవచ్చును. కాని ఎవ్వరే స్థావరముగ నుందురో యూహింపజాలము."

"మేము మూడుతావులకును బోయి దోపిడిగాండ్రయజమానురాండ్రను బట్టుకొనవలసియున్నది. ఇది ప్రభుత్వము యొక్క ఆజ్ఞ. మీరు మాకాయాతావులను జూపించుటకు మావెంటనంటి రాగలరా ?"

"ఉత్తరువైనచో రాగలము." ఈఈ స్థావరముల యందు మేముసేవచేయుచుంటిమని చెప్పగలము. వాటినిమీకు జూపగలము. ఇంతకుమించి మేమేమియు జేయచాలము.''అని పల్కెను.

అంతట భాస్కరరావును, గళ్యాణరావును, వీరి వాఙ్మూలము లన్నిటిని, దీసికొని న్యాయాధికారియగు విశ్వేశ్వరరావు సభాస్థానమునకు బోయిరి. ఈ వాఙ్మూలము లన్నిటిని విశ్వేశ్వరరావునకు జదివివినిపించిరి. విశ్వేశ్వరరావు నెమ్మదిగ వాటి నన్నిటిని నాలకించెను. కాగితములు చేతగొని వాఙ్మూలముల నన్నిటిని జదివెను. తుదకు "వీరిలో నెవ్వరును బుద్ధిపూర్వకముగ నేరముచేసినవారు కారు. నేరముచేసి దండనీయులగువారు ముప్వురును వేఱుగనున్నారు. వారిని బట్టుకొనవలయును. నిరపరాధులను దండించుటకు న్యాయశాస్త్రమొప్పుకొనదు. ఇప్పటికే మూడు దినములనుండి వీరు నిర్బంధములో నుంచబడినారు. ఇంక వీరిని విడుదల సేయుటయే యుచితము"అని వాక్రిచ్చెను.

వీరినిప్పుడు విడుదలచేసినచో ముఖ్యారాంధ్రుడు దొరకరు. కావున మఱిమూడు దినములవఱకు వీరిని సాధారణ నిర్బంధమునందుంచుటకు నుత్తరువు లీయవలయునని అపరాధ పరిశోధకులు వాదించిరి. అప్పుడు విశ్వేశ్వరరావు "మఱిమూడు దినములవఱకు వీరిని సుఖకరమును, బాధకరముగానిదియునగు నిర్బంధరీతిలో నుంచుడ''ని అనుజ్ఞయిచ్చెను.

ఆయా౯తిగ్గి కొనిభాస్కరరావు కళ్యాణరావునొద్దకు దీసికొనిపోయిచూపి, ముందేమిచేయవలయునని ప్రశ్నించెను. అంతట ముప్పురును గొంతతడవు రహస్యాలోచన మందిరము లోనికి బోయి మారిణీతియమును బట్టుకొనుట యెట్లని విచారించిరి. కొన్నికొన్ని మార్గములను రహస్యముగా నిర్ధారితములజేసికొనిరి. ఇరువురును రెండు స్థావరములకును ఒకేసమయమున సైన్యముతో బోవలయునని తీర్మానింప బడెను.

అంతట నెవ్వరేతావునకు బోవలయునను ప్రశ్నము వచ్చెను. ఇదియట్లుండ ఛాయా సత్యవతుల పునస్సమార్జన మున కనుకూలముగా కార్యక్రమము విభజింపబడవలసి యున్నది కళ్యాణరావు ప్రభుత్వకార్యము నిర్వహించుచున్న వాఁడేగాని యతని మొగమునఁ గత్తివాటునకైనను నెత్తురు చుక్క లేనట్లుండెను. భాస్కరరావు ధీరత్వమునంజేసి గంభీరముగఁ బ్రవర్తించుచున్నవాడేగాని ఛాయా వియోగ మతనిని బెద్దగ బాధించుచున్నది. తొలుదొల్త భద్రాచల గుహాంతర మున నెవ్వరున్నను వారినిబట్టి యావల నాహిరీ కనుమలకు బోవలయునని కళ్యాణరావుయొక్క అభిప్రాయమై యుండెను. అందువలన గళ్యాణరావు ముప్పదిమంది సాయుధులగు రక్షక భటులతో నాహిరీకనుమలకు బోవునట్లు ను నిరాంతమయ్యెను. పట్టుబడిన పరిచారిక స్త్రీలలో నొక్కతెనుమాత్రము వ్యక్తిని

గుర్తించుటకును, స్థావరముల నిర్దేశించుటకును వెంటగైకొని కళ్యాణరావు భద్రాచలమునకు బయనమయ్యెను. భాస్కరరావును నట్లే పట్టుబడిన పరిచారికలలో నొక్కతెను వెంటనిడికొని ముప్పదిమంది రక్షకభటులతో నాహిరీ కనుమలకు బయనము సేసెను. ఏ పరిస్థితిలో నెవ్వరు దొరికినను, ప్రాణములతో దీసికొనిరావలయునేగాని, దోషియైనను విచారణకు పూర్వము చంపివేయరాదని న్యాయశాస్త్రవిధియని చర్చించుకొనియే పయనములు సేసిరి.

---

# హంతకురాలు

## పదునెనిమిదవ ప్రకరణము.

శతమారి యౌవనప్రాయమంతయు ప్రియరహితముగ గడచెను. తల్లితోఁబోరాడి, యిల్లు బయలువెడలినదాదిగ బదిలక్షలవిలువగల సువర్ణరత్నములను బోగుచేసెను. ఆధనమును జూచినప్పుడెల్ల తనకొకమిత్రుడు లేకపోయెనుగదా యని విచారించుచుండెను. ప్రియసమావేశము లేకపోవుట వలన శతమారికి జీవితముపై విరక్తిపొడచెను. దానివలన నార్జిత ధనముపైనను విరాగబుద్ధియుగలిగెను. విచారముచేసి తుదకు విశ్వేశ్వరరావును జ్ఞప్తికిదెచ్చుకొని "కడసారిప్రయత్నముగ విశ్వేశ్వరరావుకొక సందేశమువ్రాయుటయు, ఈ ధనము నంతయు దన తల్లికిజూపి తనబుద్ధిపాటవమునుగూర్చి యామెకు జెప్పి యామెను సంతోషపఱచుటయు నను రెండుకోరికలు మాత్రమామె మానసమున రేబవళ్లు పనిచేయుచుండెను. ఆనాఁటియుదయమున శతమారి విశ్వేశ్వరరావు కిట్లొకలేఖ వ్రాసెను.

ప్రియవల్లభా ! విశ్వేశ్వరరాయా?

నీవునాకు సంకల్పమనోహరుడవు. తొలిసారి నిన్ను జూచినప్పుడే నామానసము లీనమైనది. ఇఁకనేను వేఱొక పూరుషునియందు దృష్టిపెట్టుకొనలేదు. నేనిప్పటికి పదిలక్షల

విలువగలయా స్తిని సంపాదించితిని. ఈయాస్తియంతయు నీస్వాధీనము చేసెదను. నన్ను సేకరించి పాలించుము. ఇందులకు నీవుసమ్మతింపని యెడల, నాప్రాణములను బరమేశ్వరున కర్పణ చేయుచున్నాను. నేటరాత్రి తెలవారుపూర్వము నీనుండి ప్రత్యుత్తరమురాని యెడల నేనంతమునొందితినని నీవు తెలిసి కొనవచ్చును. ఇది యేకడసారియభ్యర్థనము. నమస్కారములు.

ఇట్లు. శతమారి.

ఈయుత్తరము నొక కాగితపు సంచిలోనుంచి విశ్వే శ్వరరావు పేర పైవిలాసమువ్రాసి, యొక సందేశహారునకిచ్చి విలాసవతీ నగరమునకంపించెను. ఈయుత్తరమునకు బ్రత్యు త్తరము వచ్చెనేని దానిని నా తల్లియగు రంగసాని కంద జేయవలయును. అని రహస్యముగ మఱియొక యనుచరునకు జెప్పెను సందేశహారి లేఖతో నిర్గమించెను. వెంటనే యను చరుల యధీనమున నున్న నాలుగు గుఱ్ఱములను దెప్పించి, సువర్ణరత్నములను నాలుగు మూటలుగా సంచులలో గట్టించి గుఱ్ఱములపై గట్టించెను. నలువు రనుచరులను, బిలిచి ఈ గుఱ్ఱములతో మీరు నేటి సంజవేళకు విలాసవతీనగరమున నివసించు నాతల్లియగు రంగసాని యింటికిబోయి ఈద్రవ్యము నామెకు స్వాధీనము చేయవలయును. నేనును మీవెంటనే పయనమైవచ్చెదనని వారిని బంపివైచెను. సంజకెంజాయలు గోదావరీతీరస్థమగు గుహాంతరాళమునం బ్రవేశించు సమయ మున నొక యశ్వరాజమును దెప్పించుకొని, నదీతీరమున నిలువబెట్టి, తన పిస్తోలును, బదనుగల బాకును మేని వలు

వలలో నమర్చికొని, యొక్కపరి గౌతమీ మాతకు నమస్క
రించుచు నిట్లు ధ్యానించెను.

"మాతా! గోదావరీ! నీ పుణ్యజల సంస్పర్శమున జేసి
యీ నా భౌతిక శరీరము పావనమైనది. నీజలసారము దిన
దినమును నాయంతరంగమున జొచ్చుటచే నాకు నశ్వరమగు
ధనమునందును ఈశరీరమునందును వైరాగ్యము లభించినది.
ఇక నేను నీపవిత్ర జలసేవసేయు భాగ్యమునకు దూరస్థ
నగుదునని నాయంతరాత్మ బోధించుచున్నది.

తల్లీ! ఇదియే నీకు నాకడసారి నమస్కారము. నాకిట్టి
బుద్ధి సంపద ననుగ్రహించినందులకు నెల్లజన్మముల యందును
నేను నీకు కృతజ్ఞురాలను. ఇక నేను బోయివచ్చెదను. నా
దోసములు మన్నింపుము." అని వాకుృచ్చి, నదీ మాతకు
సాష్టాంగ నమస్కారముసేసి, యశ్వరాజము నధిరోహించెను.
ఆనందదాయకమగు గమనముతో నాతురంగ తల్లజము.
విలాసవతినగరమార్గము ననుసరించెను. వాయువేగమున
బోవుచు నా యశ్వరత్నము రేయి మొదటిజాము ముగియు
సమయమునకు శతమారిని విలాసవతికి జేర్చెను.
ద్వారబంధమున జేతులు పెట్టుకొని త్రోవ నెదురుచూచు
చున్న రంగసాని, తనబిడ్డ నశ్వమునుండి నేలకురుకగనే
గవుగిలించుకొని యతి శీఘ్రముగ లోనికి గొంచుపోయెను.
తన్నును తన ధనమును నిల్లుజేర్చిన యనుచరులకు సంతృప్తి
కరములగు బహుమానములనొసంగి, "మీరింక పాపికొండల

యుందుండక వేఱుతావుల నివసించుచు యథేచ్ఛం జీవించు డని వాక్రుచ్చి, జయప్రదముగ బంపివైచెను.

శతమూరి తల్లికినమస్కరించి తనయుదంతమునంతయు విశదముగాజెప్పెను. రంగసాని కుమారి రాగమనమునను ద్రవ్య లాభము వలనను భావానందము నొందెను గాని, క్షణమాత్ర మున నామె యానందము విచారముగా మాఱిపోయెను. శత మూరినిబట్టుకొన వలయునని అపరాధపరిశోధకుల యొక్కయు, ప్రజలయొక్కయు పన్నాగములను ప్రయత్నములను. అతిశీఘ్ర కాలమున తెలియజేసెను. శతమూరి యించుకయు భీతిచెంద లేదు. ఈనాటి సాయంకాలమువఱకు నీకెవ్వరియొద్దనుండియైన, నొక యుత్తరమువచ్చెనా? యని ప్రశ్నించెను. నాకెచ్చటనుం డియు లేఖరాలేదని తల్లి వాక్రుచ్చెను. వెంటనే శతమూరిముఖ మున నాశారేఖలంతరించినవి. తల్లితోఁ దుదిమాటలుగా నిట్లు ప్రసంగించినది.

“అమ్మా! నీవు నన్ను జిరకాలముపెంచి పెద్దదానిని జేసితివి. నీకష్టమును సఫలముజేయుటకు బరమాత్ముని యాజ్ఞ లేదు. నీవు నాకైవెచ్చబెట్టినధనమునకు పదిరెట్లధనమును స్వాధీనముజేసి నీఋణముదీర్చుకొంటిని. పరమేశ్వరుడు నన్ను బిలుచుచున్నాడు. నాస్థానమున దశమూరిని నీవు బిడ్డగా భావించుకొని నీవార్ధక్యమున నామెచేసపర్యలంది నీజీవితమును వెళ్ళబుచ్చుకొనుము. ఈ ద్రవ్యమును నీవు భూస్థాపన జేసికొని భద్రముచేసికొని యథేచ్ఛగా వ్యయముజేసికొనుము. ఇదే నాకడపటినమస్కారము. సెలవుదీసికొనుచున్నాను.” అని

ప్రసంగము ముగించి దొడ్డిలోనికిబోయి రెండు గంపలమన్ను తెచ్చి వేదికగానమర్చుకొని యొకయరలోజేరి, శ్రీరామ చంద్రుని పటమును విగ్రహమును మోళిలనిడుకొని, ధ్యానించి యిట్లు స్తోత్రము సేసెను.

"జగదీశ్వరా! సీతారామా!

నా పూర్వజన్మమున జేసిన యకృత్యముల ననుసరించి నాకీ పుట్టుకగలిగినది. నీవు నాయందుదృష్టినుంచి ఇంతవఱకు శౌర్యోత్సాహములతో జీవితమునడపితివి. నేను మాతృఋణ మును దీర్చికొనుటకు ఎన్నియో యకృత్యములు, మాయో పాయావలంబనముచేసి కృతకృత్యురాలనయితిని. నీజీవితమున పెద్దకాలము నిన్నారాధించుభాగ్యము నాకుగలుగలేదు. ఈ తుదిసారిచేయు నీచరణకమలధ్యానముతో నీవుతృప్తిపడి నాకుఁ బునర్జన్మములేనట్లు వరమొసంగుము. పాపినినైనను భవచ్చరణ కమలములను శరణముగాగొని నీయందలిభక్తిచే నిన్నుజేర నిశ్చయించుకొంటిని గనుక నాకింతటితో మోక్ష మొసంగుము. ఇదియేనీపాదములకు నా క డ సా రి న మ స్కారము"

వెంటనే తనచేతనున్న బాకుదీసికొని, రొమ్మున బొడుచుకొని రామచంద్రా! విశ్వేశ్వరా! యని యుసురుల బాసెను.

---

# హంతకమాదాయవి

## పందొమ్మిదవప్రకరణము.

కళ్యాణరావు రక్షకభటులతో భద్రాచలముజేరి పలు తావులకు భటులనుబంపి సహస్రమారికొఱకు జాల వెదికించెను. ఎచ్చటను నామెజాడగానరాలేదు. నూతనముగా నీగ్రామమునకు వచ్చినవారి నివాసము లెచ్చటనున్నవని విచారణ చేయుచుండెను. పడమటిభాగమున గుట్టపైని గుడిసెలలోని వారు క్రొత్తగా వచ్చియుండిరని తెలిసినది పొద్దుగ్రుంకుసమయమున నతడా గుడిసెలచుట్టును రక్షకభట సైన్యమునుంచెను. ఆవలీవలకు గంగిరెద్దునాడించుచుబోయిన దోపిడిగాండ్రిందఱు నిండ్లకు జేరుకొనుచుండిరి. అందఱును గుడిసెలలోజేరి యాహారప్రయత్నముననున్న సమయమున నొక్కసారిగా నందఱిని రక్షకభటులచేబట్టించి చేతుల కరదండాలువేయించి నిలువబెట్టెను. సహస్రమారి యెచ్చట నున్నదో చెప్పవలయును. అట్లు చెప్పకున్నచో మిమ్మునందఱను వరుసగా గాల్పించెదనని బెదిరించెను. ఈగుట్టలోనున్న బిలమునే యామె నివసించును. అని వారాగుహాముఖమును జూపించిరి. వ్యక్తిని గుర్తించుటకు వెంటనున్న పరిచారికతో

కళ్యాణరావు గుహాముఖమును బ్రవేశించెను. గుహాంతరాళము చీకటిగానుండెను. రెండుగజముల దూరమునకు నడచినంతనే కళ్యాణరావు విద్యుద్దీపమును వెలుగజేసి చూచెను. కొలదిదూరమున నొక స్త్రీవిగ్రహము గనబడెను. ఈమెయే సహస్రమారి యగునా ? చూచి చెప్పుమని పరిచారికను ముందుకు బంపెను. ఆ పరిచారిక నాలుగడుగులు వేయకముందే యా విగ్రహమునగల యొక రంధ్రములో నుండి "ఢాం" అను శబ్దముతో నొక గుండు వెలువడి పరిచారిక రొమ్మునకు దాకి దూసుకొని కళ్యాణరావు ప్రక్కగా బోయెను. ఆవిగ్రహము కదలక మెదలక నట్లే నిలువబడియుండుటచే, నిదియొక యంత్రపుబొమ్మయని కళ్యాణరావప్పుడు గ్రహించెను. పరిచారిక నేల వ్రాలి ప్రాణముల బాసెను. అప్పుడతడు దోపిడిగాండ్ర యొద్దకువచ్చి, యీ గుహాలోని కింకొకమార్గము లేదాయని యడిగెను. ఈగుట్టకు వెనుకభాగము నానుకొనియున్న గోదావరిపాయకు బైభాగమున మఱియొక మార్గము గలదని చెప్పిరి. అప్పుడు కళ్యాణరావు రక్షకభటులను శతఘ్నులను బేల్చుకొనుచు వెనుక నుండి లోనికిఁ బ్రవేశించుడని యాజ్ఞాపించెను. కొందఱు శతఘ్నులను బేల్చుచు వెనుకభాగము నుండి గుహాలో బ్రవేశించిరి. బిలమునకు బ్రక్కగల గోడగూటిలో నిలువబడియున్న సహస్రమారిని భటులు పట్టుకొని యామెకడనున్న ఖడ్గాదులను లాగుకొన యత్నించిరి. ఒకడు పెద్ద ఈలవైచి సంజ్ఞానాదము చేసెను. రక్షకభటులందఱును లోనికి బ్రవేశించి శతఘ్నుల నెత్తిరి. ఆయుధముల గ్రిందవైచుమనిరి.

పెనుగులాటలో నామె యొక్కనిమాత్రము రొమ్మునఁ బొడిచెను గాని, ఎత్తబడిన శతఘ్నులను జూచి, యింకఁ బ్రయోజనము లేదని లొంగిపోయెను. వెంటనే చేతులు బంధించి యామెను బిలము వెలుపలికిఁదీసికొనివచ్చిరి. వ్యక్తిని గుర్తించుటకు వచ్చిన పరిచారిక పడిపోయెను గదాయని కళ్యాణరావు చాల విచారపడెను. ఆమెను దోపిడిగాండ్రకుజూపి ఈమెను మీరు గుర్తింతురా! యని యడిగెను. వారందఱు నామెయే మాయజమానురాలగు సహస్రమారియని తెలిపిరి. అప్పుడెట్లయిన నాత్మహత్య జేసికొనవలెనని సహస్రమారి యత్నించెనుగాని, చేతులుబంధింపబడి యుండుటచే నేమియుఁ జేయజాలక పోయెను.

భద్రాచలముననున్న ప్రభుత్వోద్యోగుల సాయమున వెంటనే సహస్రమారికి గాలుసేతులు విఱిచికట్టించి యొక పడవలో వేయించి, రక్షకభటులతో గోదావరి దాటించి, సిద్ధపఱుపడియున్న శకటములో నెక్కించెను. కళ్యాణరావు కొఱకు వచ్చిన శకటముపై నతడధిరోహించెను. నలుప్రక్కలను విచ్చుకత్తులతోడను, సిద్ధశతఘ్నులతోడను రక్షకభటులు నడచుచుండ, గళ్యాణరావు జయజయ ధ్వానములతో సహస్రమారిని విలాసవతీనగరము నందలి కారాగారమునకు గొంపోయి యందు బంధించెను. ఆమెయనుచరుల నందఱను వేర్వేరు చెరసాలలో బంధింపజేసెను.

---

# హంతక చూడామణి
## ఇరువదవప్రకరణము.

ఆహిరీకనుమలలోనున్న దళమారి తనభృత్యులను గూఢచారులనుబంపి శతమారి విలాసవతికి జేరినట్లును, సహస్రమారి కళ్యాణరావు చేతజిక్కి బంధింపబడినట్లును తెలిసికొనినది. రేహోమాహో అపరాధపరిశోధకులు తన స్థావరముపైబడి తన్నుసైతము బంధింతురని నిశ్చయించుకొని భావికర్తవ్యమును గుఱించి యాలోచింపసాగినది. ఈసమయమున దనవలన నుపకారమువడసిన ఛాయా సత్యవతీదేవుల వాస్సహాయమువలన ప్రాణరక్షణము చేసికొనుట యుచితమని యూహించినది. తొలుదొల్త తనయొద్దనున్న భృత్యులనందఱకును బరిస్థితులనుదెల్పి, వారి జీవితోద్ధరణములకొఱకు వలసిన ద్రవ్యమొసంగి యందఱను ప్రదేశాంతరములకు బంపివైచినది. ఇప్పుడాలోయలోని గుహాలో ఛాయాదేవియు, సత్యవతీదేవియు దానుమాత్రము మిగిలియుండిరి. అప్పటి వ్యవహార పరిస్థితులనన్నింటిని, యువతీద్వయమునకు దెలిపి, నాప్రాణములను గాపాడుటకు మీరు పూనుకొందురను ధైర్యముతో నాపరివారమును బంపివేసితినని చెప్పెను. అప్పుడు

ఛాయాదేవి, ధైర్యముతో దశమారికిట్లనెను. "నీవు మా నిర్బంధములనుబాపి మమ్మునాదరించి, మాకు ప్రాణదానము సేసితివి. నీకెట్టియుపాయమును గలుగకుండ మేము కాపాడెదము. భయపడకుమని ధైర్యముచెప్పిరి.

అంతలో భాస్కరరావు రక్షకభటవర్గముతో శతఘ్నుల గాలిలోనికి బేల్చుకొనుచు గుహాముఖమును సమీపించుచుండెను. ఛాయాదేవి ద్వారము వెలుపలకుబోయి భాస్కరరావున కగబడునట్లు బాటలోనిలువబడెను. భాస్కరరావు తన భార్యనుజూచి యానందబాష్పములరాల్చి లోగడపొందనైన కష్టములకు సంతాపము వెల్లడించెను. గుహాభ్యంతర పరిస్థితినిగుఱించి ప్రశ్నింపఁ ఛాయాదేవి "ఇచ్చటి దోపిడీగాండ్రందఱు తమరాకనూహించి, ప్రదేశాంతరములకు వెడలిపోయిరి. మా ప్రాణరక్షణముచేసిన దశమారియొక్కతె మాత్రమిందున్నది. ఆమెకుమేము ప్రత్యుపకారము చేయుదుమని వాగ్దానముచేసి మావెంటనుండ నిలుపుకొని మీరాక కెదురు చూచుచుంటిమి. మీరింక లోపలికివచ్చి, విశ్రాంతి దీసికొనుడు. మనమందఱమును గలిసి విలాసవతికి బ్రయాణము సేయుదమనెను.

భాస్కరరావు తనయిల్లాలి మృదువాక్యముల కానందించి, భృత్యులనెల్లర బయటనుంచి తాను ఛాయాదేవితో

లోపల ప్రవేశించెను. వెంటనే సత్యవతీదేవి యతని కాశీర్వాద మొసంగెను. దశమూరి శరణుజొచ్చి, పదాభివందనము చేసెను. కొందఱుభృత్యులను లోనికిబిల్చుకొని, మహిళామాత్ర యము నాహారపదార్థములను బుష్కలముగ సిద్ధపఱచిరి. వారెల్లరునుగలసి భుజించిరి. రక్షకభటులకు కడుపార భోజనము పెట్టించిరి.

మూడవజామున నందఱును విలాసవతికి బయనమైరి. మార్గమధ్యమున దశమూరిని గాఢముగ నాలోచించి భాస్కరరావు దశమూరితో నిట్లనెను. "నీవు అభియోగమునకు సంబంధించినదానవు. విచారణపూర్తియగునంతవఱకునీవుప్రభు త్వము స్వాధీనములో నుండవలయును. విలాసవతిలో నీయిచ్ఛ వచ్చినచోట నీవుండవచ్చును. అవసరమయినచో న్యాయ విచారణసభకు రాగలనని యీకాగితముపై చేవ్రాలు చేయుము. నీపై నేవిధమైన దోషారోపణము జేయబడనియట్లు నేను వ్యవహరించెదను" మఱియు నామెచే నొకపత్రముపై చేవ్రాలు చేయించుకొనెను.

అందఱును విలాసవతికి జేరినవెనుక, దశమూరి కోరిన ప్రకారము, ఆమెను రంగసాని యింటిలో నుండజేసిరి. సత్య వతి కళ్యాణరావునుజూచి అపరిమితానంద భరితురాలయ్యెను. దశమూరివలన నేను పునర్జీవి నైతినని కళ్యాణరావుకు నచ్చ

జెప్పెను. అపరాధుల పట్టికలోనుండి దశమారిపేరు కొట్టి వేయబడెను.

మఱునాడు కార్యక్రమారంభకాలమున సహస్రిమారియు ననుచరులును న్యాయసభకు దీసికొని విచారింపఁగా, వారిచర్యలు స్వార్థశూన్యములుగను, సహస్రమారీ ప్రేరితములుగను ఋజువు చేయబడుటచే వారెల్లరు విడిచివేయబడిరి. తుదకు సహస్రిమారి కృత్యములవిషయమై విచారణసేయబడెను. మారిణీమండలిచలన జరిగిన ఘోరకృత్యముల కన్నింటిని సహస్రిమారియే బాధ్యురాలనియు ఈమె హంతక చూడామణి యని బిలువబడదగినదనియు, నిర్ధారణ సేయబడెను. సహస్రిమారికి మరణదండన విధింపబడెను అందఱును దమతమతావులకు బోయిరి. అప్పటినుండి, ప్రజలు శాంతి సౌఖ్యములతో జీవించుచుండిరి.

---

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ పవర్ ప్రెస్, సికింద్రాబాద్